


సంపుట : ౮. విక్రమ, వైశాఖము : మే, 1940. సంచిక : ౬.

# మద్రాసు ఆంధ్రులది కాదు

మదరాసు కొంచెం ఇంచుమించుగా కోరమాండల్ తీరానికి మధ్యను వుంది. తమిళులు తొండమండలం అనిపిలిచే దేశభాగానికి కూడా మదరాసు మధ్యను వుందనే చెప్పాలి.

తొండయార్ దేశం తొండమండలం ఐంది. తొండమండలం బహు విశాలదేశం. కాగా అతి ప్రాచీనకాలంలోనే అది ఇరవై నాలుగు భాగాలుగా విభాగితమైంది. ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క బలిష్ఠమైన కోట వుండేది.

అట్లా కోటవుండడాన్ని బట్టి ఒక్కొక్క భాగానికి కొట్టమ్అనే పేరు వచ్చింది. ఈ ఇరవై నాలుగు కొట్టమ్‌లు దక్షిణపెన్న మొదలు ఉత్తరపెన్న వరకు వ్యాపించి వుండేవి.

ఈ భాగానికి తొండమండలం అని పేరు రాకపూర్వం దీనికి అరవనాడు అనిపేరు వున్నట్లు కనిపిస్తూవుంది. ఈ అరవనాడులో నివసించే ప్రజలకు అరువలార్‌లు అనే పేరు వచ్చింది.

ఈప్రదేశాన్ని పరిపాలించే పాళెగాళ్ళకు తొండమాన్‌లు అని నామం. ఈతొండమాన్‌లలో ఒకడు ముఖ్యుడై వుండేవాడు. మిగతావారు అందరూ అతని అజ్ఞానువర్తులై వుండేవారు.

ఈ తొండమాన్ నాయకులలో కొందరి రాజధానుల సంగతి వినవస్తూవుంది. వెంగడం, పళవెర్కాడు, పవత్తిరు మొదలయిన కొట్టములు వారి రాజధానులుగ పేర్కొనబడుతూ వున్నాయి.

ఇందులో వెంగడం నేటి తిరుపతి. పళవెర్కాడు అన్నది నేటి పులికాట్. పవిత్తిరి అన్నది నేటి నెల్లూరుజిల్లా గూడూరుతాలూకాలోని రెడ్డిపాలెము. ఇట్లా చెప్పడానికి తమిళసారస్వతంలో అనేకమైన ఆధారాలు ఉపలబ్ధమాతూ వున్నాయి.

స్థానిక చరిత్రలవల్ల ఇరవైనలుగురిలోను ఒకతొండమాన్ నాయకుడు పులాన్అనేకొట్టం రాజధానిగా ఏలుబడి సాగించాడని తెలుస్తావుంది. ఈపులాన్అనే ప్రదేశం నేడు మద్రాసుకు నీటిని సరఫరా చేసే రెడ్‌హిల్సు చెరువుప్రదేశమని చారిత్రక వేత్తలు నిర్ణయించి వున్నారు. రెడ్‌హిల్సు చెరువుని నేటికికూడా తమిళులు 'పులాల్ ఎరి' అంటారు.

ఈపులాన్ ప్రస్తావనతో మనం మద్రాసుసమీపానికి వచ్చాము. మద్రాసుకూడా తొండమాన్ నాయకులలో ఒకని రాజధాని ఐవున్నట్లు కనిపిస్తుంది. అట్టి తొండమాన్ రాజులలో ఒకడు అతి ప్రాచీనకాలంలో తిరువళిక్కేణి దేవస్థలాన్ని నిర్మించాడు. తిరుపతి దేవస్థానంకూడా అతడు నిర్మించిందేనని ఐతిహ్యం.

దీనినిబట్టి తొండమండలానికి చెందిన తొండమాన్ రాజులతో మదరాసుకు అతి ప్రాచీనకాలం నుంచి సంబంధంవున్నట్లు నిశ్చయమౌతూవుంది.

కంజీవరము పూర్వచరిత్రను మనము పరికించితిమంటే యావత్తు తొండమండలానికి అది రాజధాని ఐనట్లు తేలిపోతుంది. కంచి రాజధానిగా చేసుకున్న తొండమాన్ నాయకుడు తొండమండలంలోని ఇరవై నలుగురు నాయకులమీద అధికారం కలిగివుండేవాడు.

ఈకంచి తొండమాన్ ప్రభువులే కాలక్రమాన్ని చారిత్రక కాలపు పల్లవులుఐనారు. పల్లవుల కాలమునందంతా తొండమండలానికి కంచియే తిలకనగరమై వుండెను.

సంస్కృత భాషాజ్ఞానముగలిగి భారతదేశంలోని ఇతరప్రాంతాల నుండి దక్షిణదేశానికివచ్చే పండితులకు కంచి దక్షిణదేశపు విజ్ఞాన కేంద్రంగానూ, ద్రవిడదేశానికి తిలకనగరంగానూ స్పష్టపడేది.

అనంతరకాలంలోకూడా తొండమండలపు ఈవిభాగాలు ఇట్లే నడుస్తూవచ్చాయి. తొండమండలం అన్నికాలాల్లోనూ ద్రవిడదేశంలో– తమిళనాటిలో– ఒకభాగంగానే గుర్తింపబడుతూవుండేది.

చోళులకాలంలోకాని, తరువాతికాలంలోకాని దీనికి విపర్యాసం కలగలేదు. ఆఖరికి విజయనగరం రాజుల ఏలుబడిలోకూడా దీనికి విపర్యాసం ఏర్పడలేదు.

విజయనగరం రాజులుకూడా ఉన్నవిభాగాల్ని తారుమారుచేయడానికి ప్రయత్నించలేదు. ఈప్రాంతాల్ని పరిపాలించడంలో ఈప్రాంతంలో అమల్లోవున్న పద్ధతుల్నే విజయనగరవిభులు అవలంబించారుకాని వానిని అస్తవ్యస్తంచేయలేదు.

ఒకప్పుడు కృష్ణానది, దాని ఉపనది తుంగభద్ర దక్షిణఇండియాకు, దండకారణ్యానికి సరిహద్దుగా వుండేవి. ఈదక్షిణ ఇండియా అంతా ఆనాడు తమిళభాషామయమయి వుండెను.

నాడు తిరుపతికొండలవరకు(వెంగడం) అచ్చమైన తమిళభాష మాట్లాడబడుతూవుండెను. ఆమీద కృష్ణానదివరకు వడుకార్ అనేతెగ మనుష్యులు నివసిస్తూ వుండిరి.

వడుకార్లువుండే ఈప్రదేశానికి అవతల ఉత్తరాన్ని కర్ణాటక, ఆంధ్రభాషలుప్రచారంలోవుండేవి.

వడుకార్ నేడు తమిళవ్యవహారంలో ఆంధ్రులకు పర్యాయపదంగా వాడబడుతూవుంది. ఈవాడుక చాలా నవీనమైనది. పదమూడవ శతాబ్దానికి పూర్వపు ఆధారాలు పరికిస్తే వడుకార్లు వేరుగా, ఆంధ్రులు వేరుగా కనిపిస్తుంది.

తొండమండలంలో నివశించే ప్రజల్ని ఎప్పుడు పేర్కొన్నా శాసనాలు ద్రావిడులుగానే పేర్కొన్నవి. బయటివారిదృష్టిలో ఈ తొండమండలం ఎప్పుడూ ద్రవిడదేశంగానే పరిగణింపబడింది. కాగా తొండమండలం తమిళదేశంకాక మరి ఒకటికాదనుట నిశ్చయం.

ఆంధ్రుల తొల్లిటి రాజధాని బాగా ఉత్తరానివున్న ఏలూరు వద్దవున్న పెదవేగి. ఆమీద రాజమండ్రి, దెందులూరు, విజయవాడ, అమరావతి మొదలయినవికూడ ఒకప్పుడు ఆంధ్రుల రాజధానులై వుండినవి.

ఆంధ్రచాళుక్యులకాలంలో వడుకార్లస్థలానికి (ఇది ఇప్పటి రాయలసీమ అనవచ్చు) తమిళుల ఆంధ్రులు పెనగులాడారు. కాగ విజయనగరంరాజులహయాము వరకు ఆంధ్రకర్ణాట దేశాలు ఈ వడుకార్ల భూభాగానికి బాగ ఉత్తరాన్ని వున్నమాట నిశ్చయం

విజయనగరంరాజులు తుదిదశలో తిరుపతిచెంతగల చంద్రగిరి రాజధానిఐంది. ఈకాలంలో ఉద్యోగులు ప్రాయకంగా తెలుగువారు ఐవుండేవారు.

అయితే అంతమాత్రం చేత ఈప్రదేశాన్ని ఆంధ్రదేశభాగం అవడానికి ఆస్కారంలేదు.

ఆంధ్రులు ఈసంగతిని గుర్తించాలి. ఈచారిత్రకసత్యాన్ని గమనించకుండా మద్రాసులో మాకు భాగం రావాలని వారు కోరడం నేల విడిచినసాము ఔతుంది.

[ఆంధ్రభూమి సంపాదకునికి తంజావూరునుండి ఒకఅయ్యంగారు పంపిన ఆంగ్లలేఖకు ఇది అనువాదం. దీనికి ఆంధ్రులు ఏమిచెబుతారు?]

## గాలిలో కొవ్వువత్తిదీపం చలిస్తూన్నట్లుంటుంది ఆమె నడుస్తూవుంటే.

# అనార్కాలి

ఆమె పదిసంవత్సరాల బాలిక. మొగలాయి చక్రవర్తి అక్బరుకి బహుమానంగా కాబూలు గవర్నరు ఆమెను ఇండియాకు పంపాడు. అది 1589–వ సంవత్సరం. అక్బరు అప్పట్లో లాహోరులో వుండెను.

ఆమెది పారశీక దేశం. ఆమె పేరు నాదిరా. ఆమె సంరక్షణార్థం తండ్రి ఆమెను వెంటపెట్టుకుని దేశాటనానికి బయలుదేరాడు. దారిలో దొంగలు అతన్ని కొట్టి చంపివేశారు. చేతులుమారి నాదిరా తుదకు కాబూలు గవర్నరు కైవశమైంది. కాబూలు గవర్నరు ఆమెను అక్బరు వద్దకు పంపాడు.

కొత్తగావచ్చిన బాలసేవకురాలిని అక్బరు పరకాయించి చూచాడు. ఆమె అతిలోకసౌందర్యంతో ప్రకాశిస్తూవుంది. పారశీక దేశపు పడుచులకు సహజమైన సౌందర్యానికి ఆమె రాశీభూతమై వుండెను.

ఆమె నడుస్తూవుంటే గాలిలో కొవ్వువత్తిదీపం చలిస్తూవున్నట్లు వుండెను. ఆమె చర్మము అతి మృదువుగా వుండెను. ఆమె శరీరకాంతిలో ఒకవిధమైన సమ్మోహన సంపద తేజరిల్లుతూ వుండెను.

ఆమె ముగ్ధమోహన స్వరూపానికి వ్యామోహితులై ప్రజలు ఆమెకు అనార్కాలి అని పేరు పెట్టారు. అనార్కాలి అంటే దానిమ్మపువ్వు అని అర్థం.

నాటినుంచి పది సంవత్సరాల వరకు ఆమె రాజప్రాసాదంలోనే నివసిస్తూవుండెను. రాత్రిళ్లు ఆటపాటలతో పొద్దుపుచ్చే వెల్లాటకత్తెలు ఆమె నెచ్చెలులు.

అక్బరు చక్రవర్తికి ఆమెపట్ల మంచి అభిమానం కుదిరింది. నాట్యవిద్యలో ఆమె శరీరం కాకలు తేరగా ఆమె హస్త, పద విన్యాసాలు అతిలోక స్తవనీయాలు అయ్యాయి.

ఆలోలాక్షి నేత్రాలు అక్బరు తనయుడు సలీమ్ మీద లగ్నమయ్యాయి. సలీమ్ యౌవనోద్వేలితుడై వుండెను. కాగా ఇద్దరికి ప్రేమాంకురమైంది.

కాని ఇంతలో విఘాతము. అక్బరు వజీర్ అబుల్ ఫజల్ చారుల వలన ఈవృత్తాంతం తెలుసుకున్నాడు. అక్బరు చెవిలో ఊదాడు.

తనయుని అవజ్ఞతకు చక్రవర్తి కోపగించాడు. ఐనా నిదానించి పరీక్షించడానికి ఆలోచించాడు.

మాటు ఒగ్గారు. రాజభవనంలో ఒక గది. అది బాగా అలంకృతమైవుంది. దాని గోడలకు, పైకప్పుకు బంగారపు పూత. గది చుట్టూ నిలువుటద్దాలు. ఆగదిలో నాట్యవిద్యాకౌశల్యాన్ని ప్రదర్శించవలసిందిగా అనార్కాలీకి అక్బరు ఆజ్ఞ.

నాట్యము ప్రారంభమైంది. సుధాదవళములైన ఆమెపాదాలకు లత్తుకరంగు. తలకు ముత్యాల గొలుసులు. వెంట్రుకలు తుమ్మెద రెక్కలు. ఆముత్యాల తెల్లందనాన్ని, ఆవెంట్రుకల నల్లందనాన్ని తలదన్ని అరుణారుణములైన అమె కరపల్లవాలు నాట్యభంగిమంలో పైకి లేచాయి.

వాద్యసంగీతం ఆరంభమైంది. తెర ఒత్తిగించుకొని అనార్కాలి ముందుకు వచ్చింది.

చీపురుపుల్లవంటి ఆమెసన్నటి శరీరం ఆపాదమస్తకం ఒక్కసారి అల్లాడింది. ఆమె పదమంజీరాలు ధ్వనిచేశాయి. జడంగావుండిన ఆ వాతావరణాని కంతటికీ ఒక్కసారిగా చైతన్యంవచ్చింది.

సిందూరవర్ణపు ఆమె గాగరాకుచ్చెళ్లు వలయాకారంగా పరి

భ్రమిస్తున్నాయి.

అనార్కాలి నిజంగా వసంత కాలంలోని దానిమ్మపువ్వులాదిరిగానే వుండెను. సువర్ణఛాయను అవఘళించే ఆమె అవయవాలే ఆ పువ్వుకు తోడిమెలు.

తన్మయుడై సలీమ్ తదేకదృష్టితో ఆమెను చూస్తూవుండెను.

ఆమె నెమ్మదిగా తనకంఠస్వరాన్ని వాద్యస్వరంతో శ్రుతికలిపింది. క్రమంగా స్థాయి హెచ్చించింది. ఆసమయంలో ఆమె పాడిన పాట భావగర్భితమైవుండెను.

"నేను నీవు ఐనాను. నీవు నేను ఐనావు.
నేను శరీరమును. నీవు ఆత్మవు.
కాగా ఇకమీద ఎవరుకాని నేను
నీవు కాదని చెప్పలేరు."

ఆమె అక్బరువైపు వెనుత్రిప్పి సలీమ్‌కు ఎదురై వుంది. ఈపాట పాడుతూ ఆమె సలీమ్‌కళ్ళమీదకు నవ్వింది.

అసలు పరీక్షకోసం వచ్చిన అక్బరు ఈ నవ్వును కనిపెట్టకపోలేదు. అతనిదృష్టి ఆనట్టువరాలి వెన్నుమీద లేదు, అద్దములో ఆమెనవ్వును అతడు చూచాడు. దాని అంతరార్థాన్ని ఆకళించుకున్నాడు.

నాట్యం ఐపోయింది. అనార్కాలిని ఖైదుచేశారు.

ఆమె ప్రేమమూర్తి సలీమ్ ఆమెను చెఱసాలనుంచి తప్పించగలుగుతాడు. కాని ఇంతలో ఆమె దొరికిపోతుంది. ఈసారి ఆమెకు మరణశిక్ష.

సలీమ్ ఇప్పుడు ఏమీచేయలేకపోయాడు. లాహోరువిడిచి ఆగ్రాకు వెళ్ళిపోయాడు. అతనికి, తండ్రికి యుద్ధం.

ఆమె చనిపోయిన ఐదు ఏళ్ళకు 1604 లో సలీమ్ లాహోరు నగరానికి తిరిగివచ్చాడు. ఒక సంవత్సరం దరిమిలాను తండ్రి మరణానంతరం అతడు ఢిల్లీసింహాసనం ఎక్కి జహంగీర్ చక్రవర్తి ఐనాడు.

చక్రవర్తి ఐనతోడనే జహంగీర్ అనార్కాలిని సంస్మరిస్తూ లాహోరులో ఒకగోరీ కట్టించాడు.

1615 నాటికి దానినిర్మాణం పూర్తి ఐంది. అనార్కాలి అస్థిపంజరం అక్కడ తిరిగి సమాధి చేశారు. ఆసమాధిమీది చలవరాతి పలకపయిన జహంగీర్ తన విలాపాన్ని ఇట్లా తెలువుకున్నాడు:

"నాప్రేయసి ముఖాన్ని నేను తిరిగి చూడగలిగితే జన్మాంతవరకు సృష్టికర్తకు నమస్కరిస్తాను."

అనార్కాలి కర్మనాట్యానికి ఆశ్వాసాంతమైంది. ఆమె అవస్థను ప్రతిబింబించిన నిలువుటద్దం ఛిన్నాభిన్నమైపోయింది. గోరీమాత్రము నిలిచివుంది. ఆగోరీకి ఇప్పుడుకూడా అప్పుడప్పుడు శ్రద్ధగా వెల్లమాత్రము కొడుతూవుంటారు.

విధివైపరీత్యంవల్ల పంజాబు గవర్నమెంటువారి సెక్రటారియేట్ గ్రంథాలయం ఇప్పుడు ఆమందిరంలో వుంది.

అనార్కాలి గోరీకి అనుబంధితమై మరిఒక విషాద కథకలదు.

పంజాబులో సిక్కులు రాజ్యం చేసే రోజుల్లో అనార్కాలి గోరి మందిరంలో ఒక ఫ్రెంచి సేనాని కాపరంవుండేవాడు. అతనిపేరు అల్లార్డు. రంజిత్‌సింగ్ అభిమానించిన ఫ్రెంచిసేనానుల్లో అతడుఒకడు.

అల్లార్డుకు రంజిత్‌సింగ్ పాన్‌దేవి అనే ఆమెను భార్యగా ఇచ్చాడు.

పాన్‌దేవి చెంబా సంస్థానంలో పుట్టింది. చెంబాస్త్రీలు సౌందర్యానికి పేరు మ్రోసినవారు.

కను ముక్కు తీరుగల ముఖము- ఎఱ్ఱని చెక్కిళ్ళు- మృదువైన చర్మము- పాన్‌దేవి అల్లార్డుకు అల్లారుముద్దరాలు ఐంది.

ఆమెతో అతడు ఆ అనార్కాలి గోరి మందిరములోనే కాపురం వుండెను. అక్కడే ఆదంపతులు పిల్లల్నికూడా కన్నారు.

ఆ పిల్లలలో ఒక చిన్నారి బాలిక. ఆమె అల్లార్డు ప్రత్యేకాభిమానానికి పాత్రమైంది, ఆమె మూడు సంవత్సరాల ముద్దుబిడ్డ ఐవుండగా మరణించి తండ్రిని దుఃఖసముద్రంలో ముంచింది. ఆబాలికకొఱకు తండ్రి అక్కడే ఒక చిన్న గోరీ కట్టించాడు.

[మిగతా ౩౮౯-వ పేజీలో.

# రాజ్యశ్రీ

[వచనరూపకము-గతసంచిక తరువాయి.]

ఇందలి ప్రముఖ పాత్రలు :

రాజ్యశ్రీ - హర్షవర్ధనుని చెల్లెలు.
హర్షుడు - ప్రభాకరవర్ధనునికొడుకు.
రాజ్యవర్ధనుడు - హర్షవర్ధనుని అన్న.
ప్రభాకరవర్ధనుడు - స్థానేశ్వరమురాజు.
బాణుడు - హర్షవర్ధనుని ఆస్థానకవి.

రచయిత:

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్, బి.యే.

## అం౩ - రం౧

[రాచనగరులో నొకగది. ఆయాసముతో ప్రభాకరవర్ధనుడు పరుండియుండును. వైద్యుడగు అమృతశర్మ, పురాణమును చదువుటకై తర్పణశాస్త్రి కూర్చుండియుందురు.]

అమృ :

భగవంతుని యనుగ్రహమున జాడ్యము వెనుకడుగువైచినది.

తర్ప :

ఎన్నిమందులున్నను, ఆయనుగ్రహ మత్యవసరము, లేకున్న మన జీలకఱ్ఱ, శొంఠి కషాయములు భగవంతుని యాజ్ఞను మార్చునా!

అమృ :

అవి మనతృప్తికొరకు.

[ఇంతలో రొప్పుచు, పరుగున హర్షవర్ధనుడు ప్రవేశించి, జనకునిపాదము లంటుకొనును.]

అమృ :

మహారాజుగారికి గండము తప్పినది, వారికి ప్రస్తుతము అలసట గూర్పవలదు. కొంచెము విశ్రాంతి తీసుకొనుడు, తరువాత పలుకరింప వచ్చును.

హర్ష :

(మెల్లగా) అట్లే గావించెదను. ప్రస్తుతము మాటలాడుచున్నారా? ప్రమాదము తప్పిపోయినదా ?

అమృ :

ఆ! దేవుని దయవలన, మందుల మహిమవలన.

తర్ప :

రెండవదానికన్న మొదటిదే మహిమకలది.

అమృ :

(విసుగుతో) అట్లేలేవయ్యా ! (హర్షునిగాంచి) ఈ ఒక్కరేయి గడచిన భయములేదు. వృద్ధాప్యమున, రోగమునకు తొందరయేమి ? ఆలస్యమేమి ? వృద్ధాప్యమే ఒక రోగము.

తర్ప :

(మూతి వంకరగాపెట్టి) అట్లంటేనేగాని, ఈభేషజానికి నిలువనీడ యుండదు !

ప్రభా :

(కనులు తెరచి, హర్షుని గుర్తించి, ఆదరముతో) నాయనా! వచ్చితివా !

హర్ష .

(లేచి మంచముకడ కూర్చుండి) తండ్రీ ! మీ కెట్లున్నది ?

ప్రభా :

(నిరుత్సాహముతో) అన్న రాలేదా ?

హర్ష :

శత్రువుల తరుముకొనిపోయినాడు, ఈవార్త విని తిరిగి వచ్చుచుండును.

ప్రభా :

(బాధతో) హర్షా! నాకిది చరమదశ. భార మిక నీపైనున్నది.

హర్ష :
అట్లనవలదు.

ప్రభా :
నేనింక జీవింపను. ఈరాజ్యము, ఈభోగములు, ఇక నావి కానేరవు ......నాదొక కోరిక కలదు.

హర్ష :
స్వామి ! అది యేమి ?

ప్రభా :
తీర్చెదవా ?

హర్ష :
తప్పక తీర్చెదను.

ప్రభా :
నాతరువాత నీవే రాజు కావలయును.

హర్ష :
(ఆశ్చర్యముతో) అది యేమి? అన్న !

ప్రభా :
అన్నకలడు ! అత డుద్రేకమునకు బానిస. నీవే నాతరువాత రాజుకావలయునని ప్రథమము నుండియు నేను తలంచుచున్నాను.

హర్ష :
అన్న యనుజ్ఞ బడసి తమకోర్కెదీర్ప ప్రయత్నింతును.

ప్రభా :
నాకు ఆయాస మెక్కువగుచున్నది; నాతుది కోర్కెను నీకెరిగించితిని. (కనులు తేలవైచి, ఒరగిపోవును).

హర్ష :
అమృతశర్మా ! అమృతశర్మా !

—తెర—

# అంక-రం౨

[ఒకనిర్జన ప్రదేశము. కారుచీకటు లప్పుడే క్రమ్ముకొనుచుండును: అవనత వదనుడై రాజ్యవర్ధనుడు ప్రవేశించును.]

రాజ్య :
ఎట్లో గ్రామపరిసరములకు చేరితిని; (దుఃఖావేశమున) చేరితిని, లోకమున నెవ్వరికైనను అదృష్టముండవలయును కదా !...చిన్ననాటనుండి పెంచి, పోషించిన జనకుడు మట్టిపాలైనాడు ! నాతల్లి సహగమన మాచరించినది. తొలికాన్పున నన్నుగని వీరు పొందిన మేలేమి ?—ఇట్టి తనయులున్నను, గంగలో కలసినను ఒకటే. పెంచి పెద్దజేసి, అనుక్షణము కాపాడి, నాయభివృద్ధిని కాంక్షించి, సర్వమును ధారవోసిన జనకుడు మరణింప, మట్టిపాలొనరింప నేరక మరుగున జేరిన నేను చచ్చిపోయినను బ్రతికియున్నను సమానమే. కష్టకాలమున కంటికగుపడని పుత్రుడు, శత్రువునికన్న అపకారి-చేతులున్నవి, కాళ్లున్నవి, కనులున్నవి, ఎందులకు ! ఆ చెట్టునకు లేవా ? కొమ్మలు, రెమ్మలు !—నాకు ప్రాప్తములేదు—నే నీ పురజనుల మొగము నేరీతి చూడగలను ?

[ఇంతలో హర్షుడు పరుగుపరుగున నరుదెంచి 'అన్నా'యనుచు కౌగలించుకొనును :]

రాజ్య :
హర్షా ! ఈ నిర్భాగ్యుని జాడ లెట్లు తెలిసినవి?—జనకుడు కానరాడు గదా ! జనని మట్టిపాలై పోయినది? కడసారి వారిని లాలించి, వారికి ఉపచర్యగావించి, నీవు ధన్యుడవైనావు.

హర్ష :
అన్నా ! నీకై అశ్వమును బంపియున్నాను. సకాలమున కది చేరలేదు కాబోలును ! క్షమియింపుము.

రాజ్య :
వెఱ్ఱివాడా ! నిన్ను క్షమియింపవలయునా ? నేను నిన్ను క్షమియించిన, పరాత్పరు డీపాతకుని క్షమియించునా?—ఏది, నా మొగము తిలకింపుము, ఇది పాపముల పెనుగోయి కదా !

హర్ష :
అట్లనవలదు, ఇది కాకతాళీయముగా జరిగిన విషయము. కావలయునని నీవు దూరముగా తొలగిపోలేదు కదా ? ఎందుల కింత పరితాపము ?

రాజ్య :
ఎట్లో, హృదయపరివేదనమును, తగ్గించుకొనక తప్పునా ? ఇక చేయవలసిన దేమున్నది? నాయదృష్ట మట్లున్నది !

హర్ష :
జరిగిన దేమో జరిగినది, ముందు జరగవలసిన దానిని గూర్చి యోచించుట యుక్తము. తండ్రిగారు మరణించి అప్పుడే ఒకదినము గడచినది. ఈ సమయమును పురస్క

రించుకొని, శోకమున మునిగియున్న మనపై పగవారెవరైన కత్తి దూయుదురేమో! సత్వరము మీరు, సింహాసనము నధిరోహించి, లోకమున కీర్తి నెరిగించుట యుక్తము.

రాజ్య :

నా కీభారమువలదు. సమర్థుడవగు నీవే, సింహాసనము నధిరోహించుట యుక్తము. నిర్జన ప్రదేశమున నొక కుటీరమును నిర్మించుకొని హాయిగా నేను కాలమును బుత్తును.

హర్ష :

అన్నా! నీ వట్లన తగదు. అది నాయెడ నీవు గావించు అపకారము. నేను చిన్నవాడను, నీవు లోకప్రవృత్తిని బాగుగా గుర్తించి యున్నావు. నీ, నీడను కాలము బుచ్చ దలంచిన నన్నా! నీవిట్లు పెద్ద జేయుట ?

రాజ్య :

నా ఆశయముల నెరింగియు నీ వట్లు పలుకుట పాడికానేరదు. ఈ రాజ్యములను, ఈభోగములను, నే నిచ్ఛగింపను. రాజ్యాధికారమును వహించుటకు నాకధికారము లేదు. మన జనకుడు మానవప్రకృతిని బాగుగా నెరింగిన ప్రోడ. ఏకుసుమమును ఎచ్చట యుంచిన పుష్పమాల కందమువచ్చునో మాలను తయారుచేయువాని కెఱుక. ఏస్వభావముగల మానవుని, ఏస్థలము నందుంచిన, రాణించునో, రాజ్యతంత్రప్రవీణుడైన మన జనకున కెఱుక. ఆయనవలె మానవప్రకృతిని గుర్తించి, అర్థముచేసికొని జీర్ణించుకొనిన మానిసి వేరొండు కానరాదు. — రాజ్యాధికారము వహింప నా కిష్టమేలేదని ఆయన ఈవరకే తెలుసుకొని యున్నాడు. కార్యశూరుడవు, వృద్ధికాముడవు, యువకుడవు, వీరుడవు, అగు నీకే రాజ్యభార మొప్పగింప నావలె ఆయన తలంచియున్నాడు. నీహృదయమున ఉత్సాహము, నీకనులలో కాంతి ప్రవిమలముగ వెలుగొందుచున్నవి. నీ భావిసౌభాగ్యమును, నీ రాజ్యతంత్రప్రావీణ్యమును మన జనకుడు చక్కగా గుర్తించి యున్నాడు. నిజముగా నీవు, ఒక యుగపురుషుడవు కాగలవు. నీ చరిత్రమును భావిహైందవచరిత్రకారుడు సువర్ణాక్షరములతో లిఖియింపగలడు, భావి భారత భాగ్యోదయమునకు నీవంటి కార్యనిర్వాహకచతురు లత్యవసరము. నాపలుకు లాలించి, నాపై ఈ అనల్పమగు భారమును నిలుపవలదు.

హర్ష :

అన్నా! నీ పలుకులు నాకు...

(ఆర్తనాద మొనరించుకొనుచు, చినిగిన దుస్తులతో, నొకడు పరుగున ప్రవేశించును:)

హర్ష :

(కొత్తవానిని జూచి) నీ వెవ్వడవు? ఈయార్తనాద మెందులకు?

క్రొత్త :

అయ్యా! నాపేరు రామలింగడు...మొన్నటిరాత్రి – రాత్రి – మాళవరాజంట, సైన్యంతోవచ్చి–కనోజిలో కోటను ముట్టడేసి,–గృహవర్మ దొరగారిని – రాజుగారిని– దొరగారిని– చంపివేసి– రాజ్యశ్రీ దొరసానిని ఖైదుచేసి, ఊరంతా చిందరవందర–చిందరవందర–చేసి, గోల, గగ్గోలు, చేసినాడు. దొరా! ప్రాణంతో బయటపడి, దారిచూచుకుని, పరుగెత్తి, పరుగెత్తి, వెదకి, వెదకి, మిమ్ము కలుసుకున్నాను. ఆఘోరం, ఆగోల, ఆగడబిడ, చూడలేము. వినలేము.

హర్ష :

(దుఃఖముతో, క్రోధముతో, వణకిపోవుచు) అన్నా! ఇక నిలచుటకు సమయముకాదు.

రాజ్య :

ఈతని పలుకులు సత్యములేనా?

హర్ష :

కాకేమున్నది? నాకిపుడు జ్ఞాపకమునకు వచ్చినది– ఈతడు కోటలోనుండు సేవకుడు, వీనిని మన మనుమానింపవలసిన పనిలేదు— మాళవరాజగు దేవగుప్తుడు అతి నీచుడు, స్వార్థపరుడు; జనకుని మరణమున మన మిచట పొగులుచుండ, వాడిట్టి యాగడమునకు పూనుకొనినాడు. జనకునకు జబ్బుగానుండినపుడే సోదరి రాజ్యశ్రీకిని కబురంపితిని; ఇందువలననే కాబోలు ఆవార్తాహరుడుగాని, రాజ్యశ్రీదేవిగాని ఇచ్చటకు వచ్చియుండలేదు. నే నప్పుడే అనుమానించితిని. కన్నతండ్రి కష్టబాటు విని, సోదరి రాకుండునాయని తల

చితిని- ఇదిగో నేటివార్తలిట్లున్నవి! (దుఃఖముతో) అన్నా! రాజ్యకాంక్షచే ఎట్టి రాక్షసకృత్యములు గావింపబడుచున్నవో! చూడుము. మొన్నమొన్ననే సోదరి ఒక ఇంటిదైనదని తలంచుచుంటిమి- ఇంతలో వైధవ్యమా? కారాగృహవాసము, భర్తృవియోగము, జననీ జనకుల మృతి,-అన్నా! ఆలోచించెదవేల? దుఃఖభరమున సోదరి క్రుంగిపోవునేమో! సత్వరము సోదరిని రక్షింపవలయును, ఆలసింప తగదు...

రాజ్య :

హర్షవర్ధనా! కష్టసుఖములు కావడికుండలవంటివి. ఇంకెన్ని కష్టములు రానున్నవో మనకు. ధైర్యముతో నీవిందే యుండుము, నేను పోయివచ్చెదను; సోదరిని రక్షించెదను.

హర్ష :

నేను పోయివచ్చెదను. నీవిందే యుండుము.

రాజ్య :

మన మిఱువురమును వెళ్ళవలయునని తలంచుట పాడికాదు. మన మిందులేకుండిన, ఈస్థానేశ్వరమును వేరొకడు ముట్టడింపగలడు. నాపలుకు లాలించి, నీవిందే యుండుము. నే నిప్పుడే పోయి దేవగుప్తుని పరిమార్చి వచ్చెదను.

హర్ష :

అన్నా! చెల్లిలిని రక్షించు భాగ్యము నాకు లేదా?

రాజ్య :

అట్టి భాగ్యమును నేను మాత్రము కోరతగదా? మున్ముందు రాజ్యమును కైకొననున్నావు, నీ విప్పుడే యుద్ధరంగమునకు రావలదు. ఈసారి నన్నే కనోజీనగరమునకు పోనిమ్ము.

హర్ష :

(ఆలోచించి) నీయాజ్ఞ జవదాటజాలను. నీవే పోయిరమ్ము.

రాజ్య :

చెల్లెలిని రక్షించెదను, వెంటనే తిరిగి రాబ్రయత్నింతును.

హర్ష :

ప్రయత్నించుటేగాని, తిరిగి రావు?

(భటుడు, రాజ్యవర్ధనుడు పరుగున నిష్క్రమింతురు.)

హర్ష :

ఈ కష్టపరంపర లేమి? రాజ్యశ్రీ నేడు పగతురచే జిక్కియున్నదా!- ఇప్పు డన్నతో మాటాడునపుడు, 'తిరిగిరావు' అని పొరపాటున అమంగళవచనము నాకెరుకలేకయే నానోటినుండి వెలువడిన దేమి? (ఢంకానాదము) అదిగో అన్న వెడలిపోవుచున్నాడు, వానిని మరల చూడవలయుననెడి కాంక్ష నాకు కలుగుచున్నయది. (నిష్క్రమించును.)

— తెర —

## అం ౩ - రం ౩

[స్థానేశ్వరమున నొకవీధి—ప్రవేశము, కర్పూరంశాస్త్రి, రామవర్మ, వెంకటయ్య.— వెంకటయ్య కూర్చుండి వస్త్రము ముడివేయుచుండును, రామవర్మ, కర్పూరంశాస్త్రి, వానిని సమీపించి :]

కర్పూ :

ఏమోయి, వెంకటయ్యా! నడిబజారులో పంచాయితీ పెట్టినావు?

వెంక :

(తలయెత్తి) ఆ! ఆ!

రామ :

సరెలె! కర్పూరంశాస్త్రి! నీకు, ముచ్చటాడడానికి ఈచెవిటాయన కనుపించినాడు. చివరకు!

వెంక :

ఏమో అంటారు?

కర్పూ :

ఏమిలేదు! (రామవర్మనుగాంచి) ఈవడ్డీబేరాలతో ప్రతికేవాండ్లకు బజారైనా ఒక్కటే, రహస్యపుగదియైనా ఒకటే! ఆనాల్గు రాళ్లు రాలితేసరి, మానాభిమానాలు రెండవమాట. లోకంలోనున్న అన్నిబేరాలలోనికి, అసహ్యకరమైనది, ఆయాసంలేనిది, ఈవడ్డీబేరమే సుమా!

వెంక :

ఆ! మమ్మల్ని తిడుతున్నావా! మేమే లేకపోతే లోకంలో ఈ విలాసాలు, ఈసోకులు, సాగేవే! ఇంతడబ్బు పుడుతుండటం వలననే నీ వగలాటం! నీపగలాటం!

కర్పూ :

ఈయనకు చెవు డన్నారు కదయ్యా!

[మిగతా ౩౮౫-వ పేజీలో

మన కుక్కలసంగతి మీకేంతెలుసునని అలా తీసిపారేసున్నారు?

# వెంకన్న తాత కుక్క

(గతసంచిక తరువాయి.)

[నిజంగా జరిగిన కథ]

"ఆకుక్కని మావెంకన్న తాత భైరవుడూ అని పిలుస్తూ ఉండేవాడు ఎప్పుడూను. ఒకోసారి మావెంకన్న తాత పిలిచే ఆపిలుపులో ఏదో అపురూపం, అసామాన్యం- ఒకదాతని అర్థిపిలిచే దీనత్వం- ఒక రక్షకుణ్ణి రక్షితుడు పిలిచే కృతజ్ఞత- ఒకతండ్రి ప్రతిభావంతుడైన కొడుకుని పిల్చే గర్వంతోకూడిన వాత్సల్యం-యివన్నీ గోచరిస్తూఉండేవి."

రచయిత:

## కోరుకొండ సత్యనారాయణ, బి.యే., బి.ఎల్.

పాపం మాభైరవుడు ముసలాడైపోయి-ఆనాటి ఆవయసు ఆబలం ఆజవం ఆపరుగూ ఆలాఘవం- ఆనాటి భైరవుడింకా కళ్ళకి కట్టినట్టే ఉంటాడు- పరుగులెడుతున్నట్టే ఉంటాడు.

ఆనాడు ఆభోగిపండగనాడు. తెల్లవారగట్టేలేచి భోగిస్నానం చేసి బయటికొచ్చాను. దూరంగా పెద్దవీధిమొగలో భోగిమంట బ్రహ్మాండంగా మండుతోంది. మాయింటిముందు బహుళక్షీ చంద్రుడు అతినిర్మలంగా వెవెలుగు వెదజల్లుతూ ఉన్నాడు. నాయనా ఆవెన్నెలవెలుగు- ఆవెలుగులో మాయింటిముందు గుబురుగా పెరిగిన చెట్టూ చేమా చూసేసరికి- అడివి, అక్కడ వేట తలపునబడి, ఆవేళ వేటకెళ్లాలని కోరికపుట్టింది.

కోరికంటే మరీగాఢమైన కోరిక వేటమీద అలా కోరిక పుట్టకేపోవాలి గాని పుట్టిందంటే వెళ్లితీరవలసిందే. అదీ ఒక వ్యసనమే- జూదంలా. అలవాటయిందంటే మానడం- ఆకోరిక జయించడం చాలాకష్టం. అలాఅనుకునీ అనుకోవడంతోపాటు బయలుదేరే సన్నాహంలో కూడాపడ్డాను. ఆఉత్సాహం అలాంటిది. మా ఆడది మొత్తుకుంటూనే ఉంది. ఈ భోగిపూటా ఈవేటేమిటి- ఈవేషమేమిటి- ఎవరన్నా పండగని ఇల్లు వాకిలిబట్టి ఏదో సంతోషంగా వుంటారుగాని దేముడో రాముడో అని అడివినిబట్టి పోతారాఅని. కాని యిల్లాంటిమాటలు చెవికెక్కుతియ్యా?

వేటమీద సరదా. ఒడిదుడుకు వయస్సు. వంట్లో ఉడుకురక్తం. ఛీ బయలుదేరేటప్పుడు ఒద్దని అపశకునం మాట్లాడకని ఒకగదుము గదిమా.

వెళ్లి కునుకుదీస్తూవున్న మా భైరవుణ్ణి లేపాను. మా భైరవుడు- నేనెందుకు లేపుతున్నానో ఒక్కచిటికిలో- నాపిలుపులోనే గ్రహించేసేవాడు. అలాలేచి ఒళ్లు ఝూడించి- తల ఆడించి- చెవులు విదిలించి. వొక్కసారి ఆవులించి నాలుకచాపి, ముడుచుకుని. కాళ్ళు సాచుకుని ఒక్కచూపు చూచాడు నావైపుకి ఉత్సాహంతో మెరిసిపోయే ఆకళ్ళతోటి- పదవయ్యా మరి వెళదాం అన్నట్టు. నేనేఅంటే నాకంటే పడిచచ్చిపోయ్యేవాడు మాభైరవుడు వేటంటేను. మా భైరవుడిమెళ్ళో గొలుసు ఒక చేత్తో పట్టుకుని, మొల్లో కైజారు దోపుకుని, ఈలోపున మా ఆడది కట్టిన చద్దన్నంమూట తుపాకి

తగిలించుకుని, తుపాకీ ఆభుజంమీా దేసుకుని- దట్టించే పెట్టుకుని బయలుదేరీవాణ్ణి ఏ అవసరం ఎలాంటిదో అని- తోటాలపెట్టెగూడా మొల్లో భద్రపరుచుకుని గుమ్మం దిగి వీధింగో అడుగుపెట్టాను. అడుగుపెట్టేసరికల్లా ఒకపిల్లి యెదురుగావచ్చి యింట్లోకెళ్ళినట్టయింది.

ఈవెధవశకునానికి జడిసి యింతాయత్నంజేసుకున్న వేట మానుకోవడమేమిటని అయినా మనస్సు ఉండబట్టక ఒక అయిదు నిముషాలు అరుగుమీాద కూలబడి మళ్ళీ బయలుదేరాను. అప్పటికి టయిము 4½, 5 ఉండొచ్చు. అలా పోయిపోయి ఊరుదాటి అడివిని బడ్డాం, నేను మా భైరవుడూను, అతి ఉత్సాహంగా, ఈ అడివంతా మాకోసం మావేటకోసం పుట్టిందన్నట్టు.

మా భైరవుడు నాకూడా ఉంటే, నాయనా, పదిమంది పెట్టు. పదిమందితో వెళుతున్నంత ఉత్సాహం ధైర్యమూను నాకు మా భైరవుడితో వేటకెళితే. అలా అడివినిబడి -మంచి దట్టమైన అడివిలే- ఈపదేళ్ళ ఈమధ్యని ఎంత అడివి చెలిపేసారయ్యా మీానాన్నగారి డిపార్టుమెంటు- ఒక సన్నని ఫారెస్టు బాటగుండా పోతూఉన్నాం. వెన్నెల చెట్లసందుల్లోంచి ప్రసరిస్తూ కింద నవారునేసిన మంచంలా ఉంది తెల్ల తెల్లగా, నీడనీడగాను. ఆ అడివిని అలాగు ఒక మద్దిమానులుగావు, చింతచెట్లుగావు, బూరుగువృక్షాలుగావు, వేము డొంకలుగావు, వెదురు డొంకలుగావు, ఊడుగు పొదలుగావు, చిన్న గుట్టలుగావు, పెద్దకొండలుగావు-దాటుకుంటూపోతూ ఉన్నాం.

ఇంతసేపూ మా భైరవుడు పసికడుతూనేఉన్నాడు నడుస్తూనే. నేల మూర్కొంటూనే ఉన్నాడు. కాని ఆవేళ అదేం ఖర్మమోగాని నాకుగాని, అతడికిగాని ఒక్కజంతువు జాడన్నా దొరకలేదు. అదివరకెప్పుడూ అంతసేపు ఏజంతువూ దొరక్కుండా ఉండలేదు. అలా కొంచెం ఆశాభంగంతోనే సాగిపోతూన్నాం.

బహుశ 5, 6 మైళ్లు నడి ఉండొచ్చు. అప్పటికి కొద్ది

గా తెల్లవారసాగింది. మంచు పడుతూఉంది. తొలివెలుగు ఆమంచుని చీల్చుకుంటూ చెట్టుమీద నుంచి చెట్టుకీ, గుట్టమీదనుంచి గుట్టకూ ప్రాకుతూ అడివంతా వ్యాపింపసాగింది. అప్పటికి సుమారు 6½, 7 గంటలు కావస్తున్నది. మేతకు పోయిన జంతువులు బరిమీద నుంచి తిరిగొచ్చి తమతమ తావులకు జేరుకునేటయిమది ఇప్పుడైనా ఏదైనా పడకపోతుందా అనుకుంటూ అలాసాగిపోతూ పోతూ, నూనె కాలవ సమీపించాం, నేనూ మా భైరవుడూనూ.

కాలవంటే మనుష్యులు తవ్విన కాలవగాదది. అదీ ఏరే కాని దానికాపేరొచ్చింది ఎలావచ్చిందో! ఆసంక్రాంతి రోజుల్లో ఆఏట్లో ఎదో అట్టడుగున అక్కడక్కడ మాత్రం నీళ్లుంటాయి. ఆ ఉన్న నీళ్ళయినా నీలమండలుదాటి రావు.

ఆ ఏటి ప్రాంతాల్లో ఒక పెద్ద పులి తిరుగుతూ ఉందని వినికిడిగా ఉండేది. ఇక్కడొక కోడె దూడని, అక్కడొక ఆవుని, ఇక్కడొక మేకని ఎత్తుకుపోయిందని చెప్పుకుంటూ ఉండేవారు. అంతే గాని మనుష్యులకెప్పుడూ హాని జేసినట్టులేదు. నేనూ మా భైరవుడూ అలా ఆ ఏరు సమీపించి ఆఏటి యివతలిగట్టునే నడుస్తూ పోతూ ఉన్నాం ఆఖరికి అలాంటి పులన్నా ఏదన్నా కళ్ళబడితే కొట్టుకుని యింటికి పోదామని.

కాని మా భైరవుడికి అల్లాంటి వాసనకూడా తగిలినట్టులేదు. ఏమంటే ఏమాత్రం జంతువు పసి దొరికినా ఇక మా భైరవుణ్ణి పట్ట శక్యమయ్యేదిగాదు. మెళ్ళో గొలుసు తప్పించేదే కష్టమయ్యేది. యిలా వదిలామో లేదో ఉరక వేసుకుంటూ పరిగెత్తేవాడు మా భైరవుడు, జంతువుని తరుముతూనూ.

ఆవేళమట్టుకు ఏమీ లేకపోవడంవల్ల నాతోకూడా తాపీగానే నడుస్తున్నాడు భైరవుడు. అలా మేము ఆఏటిగట్టున మూడు నాలుగు ఫర్లాంగులు నడిచేసరికి ఒక చిన్నకొండ- కొండ అనే కంటే గుట్టంటే బాగుంటుం

దేమో— మాదారి కడ్డొచ్చింది. అడివిమాత్రం అంటే చెట్లూచేమా, పొదా డొంకా చాలాదట్టంగానే పెరిగుంది అక్కడ. సరేనని ఆగుట్టచుట్టి తిరిగి ఆపేటిఒడ్డునే పోదాం, నీటివనరుకి ఈ ఏటొడ్డునే ఏ జంతువన్నా దొరకాలి అని అనుకుంటూ ఆగుట్ట తిరుగుతూ గుట్టసగాని కొచ్చేసరికి అక్కడ డొంక గొయ్యి ఆగుట్టవంచనే కనబడింది. గొయ్యిగదా అని తప్పుకుని తప్పుకుని నడుస్తున్నాంమేం.

కాని ఇంతట్లో ఏంపసికట్టాడో ఏమో మాభైరవుడు గొలుసు లాక్కోవడం మొదలెట్టాడు. నాకుకూడా ఆగోతిలోనుంచి మరమరధ్వని వినొచ్చింది— ఎవరో గురగుర ధ్వని చేస్తున్నట్టు, ఏవో పిల్లులు కస్సుబుస్సు అంటున్నట్టూను. దాంతో నేనూ కుతూహలం పట్టలేక ఆగోతిలోకి తొంగిచూచాను. చూస్తునగదా ఆగోతిలోపల కళ్లు విడీవిడని పెద్ద బావురుపిల్లులంత మూడు పులిపిల్లలు కనిపించాయి. బహుశ వాటిని పులి ఈని మూడు నాలుగు దినాలకంటె ఎక్కువయివుండదు. ఆపులిపిల్లల్ని అలాచూసేసరికి నాకెక్కడలేని సంతోషం పుట్టుకొచ్చింది. ఎంతో ఉత్సాహం కలిగింది. ఆ సంతోషంలో ఆఉత్సాహంలో నా ఒళ్ళే మరిచిపోయేను.

ఏమంటారా ఈ దిన మెంతో దుర్దినం ఒక్క వేటన్నా పడలేదు ఇంతసర్దా పడొచ్చినందు కనుకుంటూ ఉంటే యివి కళ్ళబడడం ఎంత ఆనందం! ఏశ్రమా లేకుండా మూడు కాబోయే భయంకర వ్యాఘ్రాలు మనచేతిలో పడ్డాయి. పైగా యిలాంటి సంఘటన నాకిదే మొదటిసారి. ఆకొత్త అనుభవం లోకూడా ఒక వింతసంతసం. ఇల్లాంటి పిల్లల్ని ఏ సర్కసువాళ్ళకో, జంతుప్రదర్శనశాలకో అమ్మితే మంచి డబ్బొస్తుందని విన్నానేమో అది తలుచుకునేసరికి నా సంతోషం రెట్టించింది.

ఇంతలో మాభైరవుడుకూడా గొలుసు బలంగా లాగేస్తుంటే పిల్లల్నిపసిఘట్టి, నేను ఆగొలుసు విప్పేసి భైరవుణ్ణి ఒదిలేసాను. నేనుపిల్లల్ని తీస్తూఉండగా తల్లిపులొస్తే కాస్తూ ఉంటాడని అలా భైరవుణ్ణొదిలేసి, తుపాకీ, తుపాకీనున్న చద్దన్నంమూటా ఆఒడ్డునపెట్టి, మొల్లో కైజారు దిగేటప్పుడు అడ్డొస్తుందేమోనని అదిగూడా వాటి సరసనే భద్రంగాపెట్టి, నడుముకి పైగుడ్డ బిగించి, ఏమాత్రం లోతుంటుందో ఈ గొయ్యని తిరిగి మళ్ళీ ఒకసారి పరీక్షించి,—ఉంటుంది ఒక నిలువున్నర రెండు నిలువులలోతని కొలతేసుకుని, ఆఒడ్డునే దూకడానికి వీలుగా చేతులానుకుని పాదాలమీద కూచుని ఆ పిల్లల్ని పైకిలాక్కొచ్చే ఉబలా

[మిగతా ౩౪౧-వ పేజీలో.

## 'దక్షిణాదివాళ్లు ఉత్తరాదివాళ్లకు ఇకముందు పల్లకీ మోయజాలరు'

# ఔత్తరాహులు : ఆంధ్రులు

"జాతీయసమరంలో అగ్రతాంబూలం పుచ్చుకున్న ఆంధ్రదేశాన్ని గురించికాని; ఆంధ్రనాయకుల్ని గురించి కాని వుత్తరదేశంలో లేశమాత్రంకూడా తెలియదు."

రచయిత :

ఎం. వి. కృష్ణారావు, ఎం. ఏ.

### ఆత్మపరీక్ష

ఆంధ్రులకి ఉత్తరదేశాన్ని గురించి అక్కడి జనాభావిషయమై చాలా ఉన్నతమైనభావా లున్నాయి. ఆదేశంలో చూడవలసిన ప్రదేశాలు యెక్కువ ఉన్నాయని, ఆదేశస్థులు జాతీయత, దేశభక్తి గుత్తకు పుచ్చుకున్నారని, మనదేశానికి స్వరాజ్యం స్వాతంత్ర్యం అంటూవస్తే, ధైర్యస్థయిర్యాలకి పేరు పొందిన ఔత్తరాహులవల్లనే రావాలని, ఉత్తరదేశంలో పుట్టిన ప్రతివాడు గొప్పదేశనాయకుడే అనేఅపోహలు ఆంధ్రులలో చాలామందికి ఉన్నాయి. అందుచేత ఉత్తరదేశంనుంచి నామరూపాలు లేని ఏఛోటానాయకుడు వచ్చినా వాడికి బ్రహ్మరథంపట్టి, వాడేమన్నా మాట్లాడితే చెవులు దోరపెట్టుకుని వినటం మనకు పరిపాటి అయిపోయింది. దీనికి ఉదాహరణగా ఒక చిన్నవిషయం చెబుతాను. మద్రాసు రాజధానిలో ఏదన్నా శాసనసభ యెన్నికల సందర్భంలో ఓటర్లకు జవహరలాల్ నెహ్రూ వద్దనుంచో లేక రాజేంద్రప్రసాద్ వద్దనుంచో ఫలాని దేశభక్తునికి మీవోట్లనివ్వండి అనే హెచ్చరిక వస్తుంది చివరికి పూచికపుల్ల ఖాతిరిచెయ్యనివాడైనా సరే అఖిలభారతజాతీయసంస్థతరఫున నిలుచున్నాడంటె ఏగాంధో, పటేలో వాడికి మీవోట్లివ్వండి అని తాఖీదు పంపితే మహాప్రసాదమంటూ మనవాళ్లు వాణ్ణే ఎన్నుకుంటారు. అయితే ఉత్తరదేశంలో యెన్నికల సందర్భంలో ఆంధ్రనాయకుల వద్దనుంచి ఔత్తరాహులకు ఒక్క సందేశంకూడా వెళ్ళదు. ఇందులో వున్నది తేడాయావత్తు! ఈసంగతి మనం కాస్త ఆత్మపరీక్ష చేసుకుంటే ద్యోతక మవుతుంది.

### కొత్తఢిల్లీ

ఉత్తరదేశాన్నిగూర్చి యిలాంటి అపోహాలుండటానికి కారణాలు లేకపోలేదు. ఉత్తరదేశానికి ఆర్యావర్తమనే పేరు యిప్పటికి వున్నది. ఆర్యులు మొట్టమొదట సింధుదేశంలోనే కాలుపెట్టి, హిందూరాజులు పాటలీపుత్రాన్ని రాజధానిగా పెట్టుకుని, ఉత్తరదేశాన్ని పాలించటం,- ఆతరువాత తురుష్కరాజులు ఢిల్లీని ముఖ్యపట్నంగా పెట్టుకుని దాదాపు 700 సంవత్సరములు ఏకఛత్రాధిపత్యంగా ఏలటం, చిట్టచివరకు వర్తకంచేసుకుంటానికి వచ్చి రవిఅస్తమించని-తూర్పుదిక్కున ఉన్నది కాబట్టి అస్తమించదనుకోండి- బ్రహ్మాండమైన సామ్రాజ్యాన్ని స్థాపించి నేటివరకు ఏకదమ్ముమీద రాజ్యం చేయటంవల్ల. దక్షిణదేశస్థులకు దృష్టి యెంతసేపు వుత్తరదేశంవైపునే కేంద్రీకరింపబడివున్నది. ఢిల్లీ రాజధానిగా పెట్టుకున్న సామ్రాజ్యాలన్నీ నాశనం అవటంవల్ల బ్రి

టీషుసామ్రాజ్యానికిగూడా అదే గతిపడుతుందేమో అనే అనుమానంవుండి కొన్నికోట్లు ఖర్చుచేసి 'కొత్తఢిల్లీ' అనే నూతననగరాన్ని సృష్టిచేశారు. అంతకుముందు కలకత్తా భారతదేశానికి ముఖ్యపట్నంగా వున్నసంగతి అందరికీ తెలిసిందే.

## మన ప్రత్యేకత

హిందువులలో మహాభారత రామాయణ పురాణగాధలు తెలియని వారుండరు. అవన్నీ వుత్తర దేశానికి సంబంధించినవి అగుటవల్ల; బదరీనారాయణం, హరిద్వారం, కాశీవగైరా పుణ్యక్షేత్రాలు అక్కడే వుండటంచేత, హిందువులకు పరమపావనమైన గంగ, యమున, బ్రహ్మపుత్రాదినదులు ఆర్యావర్తంలో ప్రవహించటంచేత మనలో చాలామందికి వుత్తరదేశమన్నా, ఔత్తరాహులన్నా అమితమైన గౌరవం వున్నమాటనిజం. భారతదేశం ఆమూలాగ్రంగా పర్యటనచేసిన తరవాత నాకు రెండువిషయాలు బాగా స్పష్టపడ్డాయి. చరిత్రాత్మకంగ చూసినా, భూగోళరీత్యాచూసినా, వుత్తరదేశానికి, దక్షిణదేశానికి ఏవిధమైన సంబంధంలేదు. నాగరికత, విజ్ఞానం, వాఙ్మయం, వేషభాషలు మొదలైనవిషయాలు ఏమిచూసినా వ్యత్యాసాలు కనబడుతాయి. భారతీయులలో ఆంధ్రులది ఒకప్రత్యేక జాతిఅని, వారికో ప్రత్యేకవిజ్ఞాన నాగరికత లున్నాయని, వాళ్లకట్టు తీరులోను, ఆచారవ్యవహారాల్లోను ప్రత్యేకవ్యక్తిత్వంవున్నదని దేశపర్యటనంచేసిన ప్రతివాడికి బోధపడుతుంది. సాధ్యమైనంత త్వరలో ఆంధ్రరాష్ట్రంగనక సిద్ధించక పోయినట్లయితే, ఆంధ్రులు సర్వతోముఖంగా అభివృద్ధిపొంది, ఈదేశంలో తలెత్తుకు తిరగటానికి యెంతమాత్రం అవకాశంలేదని నా నమ్మకం.

## లక్నో

ఈమధ్య నేను ఉత్తరహిందూదేశ పర్యటనము చెయ్యటం తటస్థించింది. ఆపర్యటనసందర్భంలో లక్నోలో పట్టుమని మూడు నెలలు ఉండటంచేత, ఆపట్నాన్ని గూర్చి, హిందూస్థానీవాళ్ళ ఆచారవ్యవహారాన్నిగురించి సమగ్రంగా వ్రాయాలని బుద్ధిపుట్టింది. లక్నో లేక లక్ష్మణపురం ఆగ్రా, ఔధ్‌ల యొక్క సంయుక్తరాష్ట్రములకు రాజధాని. ఇంతకముందు అలహాబాదు- త్రివేణి సంగమములో- కొన్ని ముఖ్యమైన ప్రభుత్వ కార్యాలయాలు ఉండేవి. ఇప్పుడు హైకోర్టు మినహా అలహాబాదులో ప్రభుత్వకార్యాలయాలేమీ లేవు. అన్నింటిని లక్నోకి మార్చివేశారు. అలహాబాదు ప్రాముఖ్యత క్రమేణా తగ్గిపోయింది, లక్నో ప్రాధాన్యం అంతకంతకు యెక్కువౌతోంది. చరిత్రాత్మకంగా చాలా ప్రసిద్ధిగాంచిన లక్నో గోమతినదీ తీరమునఉన్నది. ఢిల్లీ రాజధానిగా ఉన్నప్పటికి, మొగలాయి చక్రవర్తు లందరికి లక్నోఅంటేనే యెక్కువయిష్టం. అందుచేత హామేషా లక్నోలోనే మకాంపెట్టి 'జల్సా' చేస్తూండేవాళ్లు మహమ్మదీయుల విజ్ఞాననాగరికతలుగాని, వాళ్ళ కట్టడాలుగాని, జగత్ప్రసిద్ధమైన మసీదులు-ఛోటా, బడా ఇమాంబారాలు- మహమ్మదీయవనితలు కుట్టిన కుట్టుపనులు, ఔధ్‌బీగములు అనుభవించిన దేవేంద్రభోగములు చూడాలన్నా, ఒకటోరకపు అత్తరులు కావాలన్నా లక్నోలోనే దొరుకుతాయి. మొగలాయి చక్రవర్తులలో అగ్రగణ్యుడైన ఔరంగజేబు పాదుషా గోరీ గోమతినదితీరముననే వున్నది. మల్‌మల్, అధీ అని పిలువబడే అతినాజూకైన మస్లినులు లక్నోలోనే తయారౌతాయి.

## రాష్ట్రీయతత్వం

రాష్ట్రీయ స్వపరిపాలన (Provincial Autonomy) ప్రవేశపెట్టబడిన తర్వాత ప్రతిరాష్ట్రం ఆరాష్ట్రీయులకేఅనేతత్వం చాలా ప్రబలంగా బయలుదేరింది. అసలు ఈతత్వానికి మార్గదర్శకులు వంగ

పుత్రులు వంగదేశంలో రాష్ట్రేతరులకు యెంతమాత్రం తావు లేదు. అథవా యితరులెవరన్నా ఉన్నట్లయితే వాళ్ళని అతినీచంగా చూసి తమతో ఏవిధమైన సంబంధబాంధవ్యాలు లేకుండా వుంచుతారు. వాళ్ళ అసమాన ప్రతిభ వల్ల కానివ్వండి– అత్తవారిచ్చిన కట్నాలవల్ల పాశ్చాత్యదేశాలకు వెళ్ళి ఉన్నతవిద్య నభ్యసించడం వల్ల అనండి– యింకా ఈ విధమైన కారణాలచేత దేశం మొత్తంమీదుండే ఉన్నతోద్యోగాలన్నీ బెంగాలీలు వశపరచుకున్నారు. మన అరవసోదరులమాదిరి ఒక్కడు ఉన్నతస్థితిలో వున్నాడంటె వెయ్యిమందిని చేరుస్తాడు. వుత్తరదేశం ప్రతిఊళ్ళోను బెంగాలీలు కాలనీల నేర్పరిచారు. ఏమార్గంచేతనైనాసరే వుద్యోగాలు సంపాదించటంలో ఆరితేరిన ఆరిందాలైన అరవ, మలయాళీలుండటం వల్ల మద్రాసు రాజధానిలో బెంగాలీలు కాలుపెట్టలేక పోయారు. సంయుక్తరాష్ట్రాలలో వుండే పెద్ద పెద్ద ఉద్యోగాలన్నీ బెంగాలీల పరమైనాయి. "యు.పి (United Provinces) వాళ్ళకు తప్ప తదితరులకు మా రాష్ట్రంలో ఏ ఉద్యోగంకూడా యివ్వకూడదు" అనే అలజడి యిటీవల సర్వతోముఖంగా సంయుక్తరాష్ట్రాలలో కూడా బయలుదేరింది. అయితే ఈ ఉద్యమం అన్ని రాష్ట్రాలకంటె చిట్టచివర ప్రారంభించింది యుపిలో. నెహ్రూ, సప్రూ, చింతామణి మొదలైన అసమాన మేధానిధులున్నా, సహజంగా యుపి, వాళ్లు యెక్కువ తెలివైన వాళ్లుకారు. పై ముగ్గురిలో యిద్దరు కాశ్మీరదేశస్థులు, యింకొకరు ఆంధ్రులు. అక్కడి జనసామాన్యమంతా పిల్లిమీద యెలికను, యెలికమీద పిల్లిని ఎక్కించటం యెరగని, కల్లకపటం తెలియని వాళ్లు. ఇంగ్లీషు తప్పుల తడకైనాసరే తడుముకోకుండా, ధారాళంగా మాట్లాడితే ఓహోహో అని తమ ఆశ్చర్యగౌరవాల్ని ప్రదర్శించేవాళ్ళు యిప్పటికీ యు.పి.లో ఉన్నారు. ఏ సత్యమూర్తిలాంటివాడో గనక ఇంగ్లీషుమాట్లాడితే ప్రొఫెసర్లు, వుద్యోగస్థులు, విద్యార్థులు చెవులు దోరపెట్టుకుని విని గుండె కొట్టుకుంటారు. 'సాతాని పండితోత్తమః' అన్నట్లు రవ్వంత తెలివితేటలున్న బెంగాలీవాళ్లు సహితం యు.పి.లో గౌరవాధికారాలు చలాయిస్తున్నారు. బెంగాలీవాళ్ళధాటికి ఆగలేక యు.పి. యు.పి. వాసులకే అనే వుద్యమం బయలుదేరింది. ఇకముందు రాష్ట్రేతరులకు అక్కడ ఏవిధమైన అవకాశాలు లేవనుకుంటాను. ఆంధ్రదేశంకూడా అదేస్థితిలో వున్నది. అన్నవస్త్రాలకు లోటులేకపోవటం వల్ల, వుద్యోగాలన్నీ అరవల హస్తగతమైనా, ఆంధ్రులలో అసంతృప్తి లేకపోయింది. ఎప్పుడైతే నిరుద్యోగసమస్య తీవ్రరూపం దాల్చిందో, రాష్ట్రేతరులు ఆంధ్రదేశాన్ని కొల్లగొట్టి తీసుకుపోతున్నారని ప్రతి ఆంధ్రుడికి బాగా నాటిందో– ఆంధ్రరాష్ట్రోద్యమం మరింత ఘాటుగా సాగింది. అరవల వుద్యోగదండయాత్రలకు ఆగలేక మనంకూడా "ఆంధ్రదేశం ఆంధ్రులకే" అని వాంఛించడంలో ఆశ్చర్యం ఏమి లేదు.

## ఆంధ్రజర్నలిస్టులు

హిట్లరు దౌష్ట్యాలకు తాళలేక జర్మనీనుండి కుక్కలులాగు తరుమబడి బ్రతుకు తెరువుకోసం భారతదేశానికి పారిపోయివచ్చిన యూదుడాక్టర్లకు (Jewish doctors) వుద్యోగాలు యిప్పించి, తన అకుంఠిత సేవానిరతితో, అసమానత్యాగంతో భారతదేశాన్నంతా పునీతంచేసి– మూర్తీభవించిన భారతజాతీయత అనదగు జవహర్‌లాల్ నెహ్రూకి– అంతర్జాతీయరాజకీయవేత్తై, ఖండాంతరాల్లో అఖండమైన ఖ్యాతిని సంపాదించుకుని స్పెయిను, చైనా, టర్కీలకు ఆపత్సమయాలలో అమూల్యమైనసహాయంచేసిన నెహ్రూకి– కూడా ఈ రాష్ట్రీయత్వం (Provincialism) వంటబట్టడం నమ్మశక్యంకానిది, అతిశోచనీయమూనూ! నెహ్రూ, గోవిందవల్లభపంతు, మోహన్‌లాల్ సక్సేనా వగైరా కాంగ్రెసు నాయకుల మద్దతువల్ల లక్నోలో 'నేషనల్ హెరల్డ్' (National Herald) అనే

ఆంగ్ల దినపత్రిక స్థాపించబడ్డదని ఆంధ్రులకు తెలిసినవిషయమే. మద్రాసీని- ఆంధ్రులుగూడా వాళ్ళలోనేజను-ఒక్కపురుగునిగూడా చేరనివ్వకుండా పత్రిక నడపాలని పత్రికాధిపతుల- అందులో ముఖ్యంగా నెహ్రూ- ఆశయం! అఖిలభారత జాతీయసంస్థకు ముమ్మారు అధ్యక్షునుగా యెన్నుకోబడిన నెహ్రూ మహాశయునికి యిలాంటి రాష్ట్రీతత్వం వుండటానికి కారణం ఏమిటా అని నేను విచారణ చెయ్యగా చివరకు యిది తేలింది. యావద్భారతదేశంలోను జర్నలిజమ్‌లో దక్షిణాదివాళ్ళే ప్రతిభావంతులని పేరుపొందారు. అందులో ఈ వృత్తికి దారితీసినవాళ్లు ఆంధ్రులు. కరాచీ 'సింధు అబ్జర్వర్'కి సంపాదకులు శ్రీ కోటంరాజు పున్నయ్య, అలహాబాదు 'లీడరు'కి శ్రీ చిర్రావూరు యజ్ఞేశ్వరచింతామణి, లక్నో "నేషనల్ హెరల్డు"కి శ్రీ కోటంరాజు రామారావు పాట్నా "ఇండియన్ నేషన్"కి శ్రీ చావలి హనుమంతరావు, ఇంకా ఈశ్వరదత్తు, కృపానిధి, కాసా సుబ్బారావు, రామకోటేశ్వరరావు, లంక సుందరం మొదలైన అతిరథుల, మహారథుల సంఖ్యకి అంతులేదు. ఈవిధంగా దక్షిణాత్యులు జర్నలిసమ్‌ని గుత్తకి పుచ్చుకున్నారు. తమ పత్రికా ఆఫీసులో దక్షిణాదివాణ్ణి పెట్టుకోకూడదని కంకణం కట్టుకు కూచున్న సుప్రసిద్ధ కాం

గ్రెసునాయకులు రెండు రోజులు గూడా పత్రిక నడపలేకపోయారుట. తన మూర్ఖపు పట్టుదల వదలుకుని విధిలేక శ్రీ కోటంరాజు రామారావు, చలపతిరావు గార్లని వేసుకోవలసి వచ్చింది. ఎందుకు పనికిరాని యు.పి. వాడు పనిచేస్తుంటే వాణ్ణి తీసివెయ్యకూడదుట, వాడికే సమస్తమైన పనులు నేర్పటానికి శాయశక్తులా ప్రయత్నం చెయ్యాలిట. పత్రికాధిపతులు ఇటువంటి పద్ధతులమీద నడిపిస్తున్నారా 'నేషనల్ హెరల్డు'ని. అందుచేత తెలివితేటలున్న చలపతిరావుకి జీతంతక్కువైనా పనిమట్టుకు పూర్తిగా తగిలిస్తున్నారు. హిందూస్థానీసోదరులు గుండెమీద చెయ్యివేసుకుని హాయిగా నిద్రపోయినా ఎడిటర్ గూడా ఏమీ అడగటానికి మగ్దూర్ లేదు. నాయకశిఖామణియైన నెహ్రూకిసహితం యిలాంటి పక్షపాతాలుండటం చాలా విచారకరం. ఈరోజుల్లో ప్రతి మనిషికీ స్వరాష్ట్రాభిమానం వుండటంలో తప్పేమిలేదు. అయితే ఆంధ్రులు గూడా మాకో ప్రత్యేకరాష్ట్రం కావాలంటె గుజరాతీ సర్దార్ ఐన వల్లాభాయిపటేలు గుడ్లెర్రచేసి 'మీకు వుద్యోగాలకోసమా ప్రత్యేకరాష్ట్రం' అని హేళనచెయ్యడం సమంజసంగాలేదు.

## నేషనల్ హెరాల్డు

ప్రస్తుతం 'నేషనల్ హెరాల్డు' సంపాదకులైన శ్రీ రామారావు గారు ఆంధ్రుల కంత పరిచితులు గారు. నేనుమట్టుకు నేను లక్నో వెళ్ళకపూర్వం వారిని గూర్చి విని వుండలేదు. ఆయన మొదటినుంచీ ఆంధ్రదేశంలో వుండకుండా ఇతరదేశాల్లోనే యెక్కువ వుంటూ, పబ్లిసిటీకోసం ప్రాకులాడక పోవటమే యిందుకు కారణం. సుప్రసిద్ధ ఆంధ్ర సంపాదకులలో ఒకరు "నేషనల్ హెరల్డు" సంపాదకులని ఆంధ్రదేశంలోను ఎరగరు, యు పి.లో అంతకంటె ఎరగరు. ఎక్కువహడావిడి, ఆర్భాటం చెయ్యకపోవటంవల్ల అక్కడివాళ్ళెరగరు. భారతదేశం మొత్తంమీద ఆయన పనిచెయ్యని పత్రికా ఆఫీసు లేదు. పదేళ్ళక్రింద Times of India లో సహాయసంపాదకుడుగా పనిచేసిన రామారావు నిజానికిప్పుడు మహోన్నతపదవిలో వుండవలసినవాడు. Anglo-Indian పత్రికల ఆఫీసుల్లో పనిచెయ్యడం ఆయనకు సుతలాము ఇష్టంలేదు; అదీకాకుండా పనిఏమి తెలియని దొరలక్రింద తాబేదారుగా వుండటానికి ఆయన అంగీకరించలేదు. వీటన్నిటిని మించింది శ్రీ రామారావు తీవ్రమైన జాతీయవాది. జీతం తక్కువైనాసరే జాతీయదినపత్రికలో పనిచెయ్యాలనే ఆయన మహదాశయం. అందుచేత ఆర్థికంగా చాలాచిక్కులుపడి అడ్డమైన పత్రికా ఆఫీసుల్లోను పనిచేసి చివరకు "నేషనల్ హెరాల్డు"లోవచ్చిపడ్డారు. భారతీయులు పత్రికాధిపతులుగా వున్న పత్రికలకు వచ్చిన గొప్ప లోటేమిటంటె, జీతం చూడబోతే బహుతక్కువ- ఇహ చేయించే చాకిరీకి అంతులేదు- అందుకనే అరవచాకిరీ అనేది సార్థకమైంది. కీ॥ శే॥ ఒక్క కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మినహా దేశం మొత్తంమీద తమ ఆఫీసులో పనిచేసేవాళ్ళకి సకాలానికి జీతాలిచ్చి, ఆయనంత దయగా మరెవరు చూడలేదనే నానమ్మకం. అటువంటి యజమానిదగ్గర ఎవరైనాసరే సంతోషపూర్వకంగా పనిచేస్తారు. శ్రీ రామారావు దినపత్రికకు సంబంధించిన ప్రతి విషయం క్షుణ్ణంగా తెలిసినవాడు- సబ్ఎడిటింగ్‌లో అద్వితీయ ప్రతిభావంతుడు, అంతమాత్రపు సబ్ ఎడిటర్ దేశమంతా గాలించినా దొరకడని నేను స్వానుభవంమీద చెబుతున్నాను. యు. పి. వాడు ఒక్కడు తయారైతే రామారావుని వుంచరనే అనుకుంటాను. ఆంధ్రపుత్రులలో యింతగట్టివాళ్ళున్నా అన్యదేశాలకు సేవచేస్తున్నారేకాని, ఆంధ్రదేశానికి ఏవిధంగాను వుపయోగకరంగా వుండకపోవటం చాలా శోచనీయం. తెలుగుమాట్లాడేవాళ్లు 23 6 మిలియన్ల జనాభా వున్నా, ఆంధ్రులకో ఆంగ్ల దినపత్రిక వుండకపోవటం తీరని కళంకమైపోయింది. ఆంగ్ల దిన

పత్రిక ఒకటి స్థాపించిననాడు ఆంధ్రపుత్రుల్ని తెలుగుతల్లి సమాదరంగా స్వీకరిస్తుందని విశ్వసిస్తాను. దూరదేశాలలో వుంటూ కులాసాగా కాలక్షేపంచేస్తున్నా ఈ రాష్ట్రేతరాంధ్రులదృష్టి అంతా మనదేశంవైపే వున్నది. త్వరలో ప్రత్యేకాంధ్రరాష్ట్రం సంపాదించుకోకలిగితే నేగాని, లేకపోతే ఆంధ్రులు యింకా అధోగతిలో వుంటారు.

## అజ్ఞానం

ఔత్తరాహులకి వింధ్యపర్వతాలక్రింద విశాలమైన దేశంవున్నదనిగాని, అక్కడ నాలుగు భాషలున్నాయనిగాని, చివరికి ఆదేశం యొక్క జాగ్రఫీ, హిస్టరీసుఁడా తెలియదంటే నమ్మండి. అయితే మనవాళ్ళకి వుత్తరదేశం యొక్క జాగ్రఫీ, హిస్టరీలు క్షుణ్ణంగా తెలియటమేగాక, ఆఖరుకి మూరుమూలవున్న Dehra Ismail khan అనే ఊళ్ళో పఠానులు యెంతమంది హిందూవనితల్ని ప్రతిరోజు అపహరిస్తున్నారోకూడా తెలుసును. ఎక్కడలేని తాపత్రయాలు మనకే పట్టినట్లున్నాయి! దక్షిణదేశంలో కృష్ణా, గోదావరినదులున్నాయనీ, వాళ్ళు Arch Reactionaries అని నామకరణంచేసిన సత్యమూర్తి, రాజగోపాలాచార్లువగైరాలు మద్రాసీలని హిందూస్థానీవాళ్ళకు తెలుసు నేను లక్నోలో వున్నప్పుడు లక్నో యూనివర్సిటీ వైసుఛాన్సలరైన హబిబుల్లా సాహెబుగారిని దర్శించే భాగ్యం కలిగింది. మామూలు మర్యాదలైన తరువాత మాయిద్దరికి ఈవిధంగా సంభాషణ జరిగింది :—

"అయితే మిస్టర్ రావు! మీది మద్రాసు రాజధానిలో ఏభాగం?"

"తూర్పుభాగం, దాన్నే ఆంధ్రదేశం అంటారు"

"మీమాతృభాషేమిటి?"

"తెలుగు"

"అయితే మరి మీభాషకో లిపి వున్నదా?

"ఒక్కలిపేమిటి కర్మం. మా తెలుగుభాషకున్నంత వాఙ్మయం మీహిందీభాషకి గూడా లేదు. భారతదేశంలో యెక్కువ మాట్లాడే భాషల్లో మూడవది మా తెలుగు"

...ఇంకా ఆంధ్రదేశాన్నిగురించి ఆంధ్రులనిగురించి ఆమహామహుడికి పక్కా అరగంటసేపు ఏకదమ్ము మీద లెక్చరుయిచ్చాను. ఎంత అజ్ఞానాంధకారంలో వున్నాడా లక్నో యూనివర్సిటీ వైసుఛాన్సలరు! జాతీయసమరంలో అగ్రతాంబూలం పుచ్చుకున్న ఆంధ్రదేశాన్నిగూర్చిగాని, ఆంధ్రనాయకులని గూర్చిగాని వుత్తరదేశంలో లేశమాత్రంకూడా తెలియదు. కాంగ్రెసు అధ్యక్షపదవి వింధ్యపర్వతాలుదాటి రానివ్వకుండా ఔత్తరాహులే గుత్తకు పుచ్చుకోవటంవల్ల, వింద్యపర్వతాలక్రింద దేశంలో నాయకుడని చెప్పుకోతగ్గవాడొక్కడుకూడా లేడని వాళ్ళగర్వం దానికి తదనుగుణ్యంగా దాక్షిణాత్యులు పక్కతాళంవెయ్యటం బాగా సరిపోయింది. మనకీ నైచ్యానుసంధానం యెప్పటికి వొదుల్తుందో నాకు తెలియకుండా వున్నది డాక్టరు పట్టాభికి ఆంధ్రదేశంలో అంత యెక్కువ పేరు ప్రఖ్యాతులులేవుగాని (ఈ అభిప్రాయంతో నేను ఏకీభవించక పోయినా) వుత్తరదేశంలో మంచిఖ్యాతి వున్నదని మనవాళ్ళు కొందరు చెప్పగా విని నిజమేమో అనుకున్నాను. కాని వుత్తరదేశంలో వుండే ముఖ్యమైన పట్నాలుతిరిగి, చాలామంది ఔత్తరాహులతో మాట్లాడిన తరవాత- కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు మినహా- తదితరజనబాహుళ్యానికి పట్టాభి విషయమై కించిత్ కూడా తెలియదని ధృవపడింది. నిరుడు కాంగ్రెసు అధ్యక్షుని యెన్నికల సందర్భంలో సుభాష్‌చంద్రబోసుకి ప్రత్యర్థిగా నిలబడి ఓడిపోయినప్పుడు 'పట్టాభి ఓటమి నాదే'నని గాంధిమహాత్ముడు బహిరంగంగా వొప్పుకున్నప్పుడు ఈవిఖ్యాతపురుషుడెవరా అని ఔత్తరాహులంతా అనుకున్నారుట! పట్టాభి ఆంధ్రులని కాదుగాని అటువంటి అసమానమేధాసంపన్నులు. భారతదేశంలో కొద్దిమంది మాత్రమే ఉన్నారు.

## మనపట్టాభి

వారు భారతదేశానికిగాక, ఆంధ్రదేశాభ్యుదయానికి చేసినసేవ నిరుపమానము, ఆంధ్రదేశంలో స్థాపించబడ్డ వాణిజ్యసంస్థలు వారి వ్యవహారదక్షతను చాటుతున్నాయి, వారురచించిన 'కాంగ్రెసు చరిత్ర', వారి 'జన్మభూమి' సంపాదకీయవ్యాసములు వారి అసమాన ప్రతిభకు ప్రబలనిదర్శనములు. స్వదేశసంస్థానములలో సంచారము చేసి ఆయాసంస్థానప్రజలకు ప్రబోధముకలిగించి, అక్కడ కాంగ్రెసు సంస్థలను స్థాపించకలిగింది ఒక్క పట్టాభేగానితదితరులెవ్వరూ చెయ్య లేదు. నేను కాంగ్రెసుప్రముఖుల తో మాట్లాడినప్పుడు ఒక చిన్న రహస్యం బయట పెట్టారు. గాంధి మహాత్ముడు యెవరికి ఝుడియడు గాని ఒక్కపట్టాభిఅంటనే ఉన్న దిట...

చిన్నప్పటినుంచి పదవులకోసం ప్రాకులాడక, మద్రాసు క్యాబినెట్‌లో మంత్రిపదవిని స్వీకరించ వలసిందని శ్రీరాజగోపాలాచారి కోరినప్పుడు మంత్రిత్వాన్ని తృణప్రాయంగా ఎంచి దాన్ని నిరాకరించిన మహాత్యాగి, తాను భారత దేశానికిచేసిన అమోఘమైన సేవ వల్ల యిప్పటికి యెన్నిసార్లో కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని అలంకరించ వలసిన పట్టాభి, యిప్పటివరకు కాంగ్రెసు గద్దెయెక్కకపోవటం చూస్తే ఈయన మహజ్జాతకుడు కాడేమో అనిపిస్తుంది. ఏదియెలా వున్నా, యెవరేమనుకున్నా ఇలాంటి పుత్రరత్నాన్ని కన్నందుకు ఆంధ్రమాతధన్య!

## పబ్లిసిటీ

భారతదేశంలో నెహ్రూపేరు విననివారు ఉండకపోవటమేం, ఆంధ్రనాయకులు నామరూపాలు లేకుండాపోవటమేమని నేను దీర్ఘంగా ఆలోచించగా తేలిందిది. జవహరలాల్ మహదైశ్వర్యవంతుడైన పండితమోతీలాల్ కొడుకుగా పుట్టటం చాలా ముఖ్యమైనవిషయం. ఆగర్భశ్రీమంతుడైన జవహర్‌లాల్ అరడజనుసార్లు జైలుకెళ్లి దేశంకోసం మహాత్యాగం చెయ్యడంతోవచ్చింది యెక్కడ లేనిపేరు. హిందూదేశం ఆమూలాగ్రంగా పర్యటనంచేసి కోట్ల కొలది ప్రజలకు ఉడుకెత్తించే ఉపన్యాసాలు యివ్వడం దానికి తోడైంది. పబ్లిసిటీ జౌత్తరాహులకు ఉగ్గుపాలతో వంట పట్టింది. అరవలలో శ్రీమూన్ సత్యమూర్తి ప్రభృతులు, ఆంధ్రులలో సర్వేపల్లి రాధాకృష్ణయ్య, కట్టమంచి రామలింగారెడ్డి, ఈవిద్యలో కొంతవరకు వాళ్ళతో తూగుతారు. ఉపన్యాసాలు, పత్రికావ్యాసాలు ఫోటోలద్వారాగాని వారి సొంతడబ్బా వాయించగల సమర్థుడు ప్రతిఫోటో ఉత్తరాది నాయకుడు! ఏరోజు పత్రిక తీసినా వాళ్ళకి సంబంధించింది ఏదోఒకటి ఉండి తీరుతుంది. పట్టాభిని భారతదేశంలో యెక్కువమంది యెరక్కపోవటానికి కారణం ఆయన మొదటినుంచీ పబ్లిసిటీయందు ఎక్కువ లక్ష్యం పెట్టకపోవటం ఒకటి, పత్రికావిలేఖరులుని 'కాకా' పట్టకపోవటం యింకొకటి. ఈరోజుల్లో ఎవరినన్నా గొప్పవాణ్ణి చెయ్యాలంటే పత్రికలు తలుచుకుంటేచాలు! ఊహూరాదండలు వేసుకుతిరిగి జనసామాన్యాన్ని వశీకరణంచేసే ఉపన్యాసాలు యివ్వకపోవటం అన్నిటికంటె ముఖ్యమైనది లోటు పట్టాభివిషయంలో.

## పల్లకీమోత

జౌత్తరాహుల్ని గ్రుడ్డిగా ప్రతి విషయంలోను అనుసరించక, వాళ్ల అడుగులకి మడుగులొత్తక వాళ్ళతో ఢీఅంటె ఢీఅని ఉత్తరదేశంలో కొద్దోగొప్పో పేరు సంపాదించుకో గలిగింది నాకు దక్షిణదేశంలో కాంగ్రెసునాయకులు ఇద్దరు కన బడుతున్నారు. వారే శ్రీసత్యమూర్తి, శ్రీరాజగోపాలాచారి! 1932 వ సంవత్సరంలో బెంగాల్

కాంగ్రెసునాయకుడు, అప్పుడు కలకత్తా కార్పొరేషనుమేయరు ఐన సేన్ గుప్తాగారు స్వదేశీ ఎగ్జిబిషన్ ప్రారంభోత్సవం జరపటానికి మద్రాసువచ్చిన సందర్భంలో తిలక్ ఘాట్‌లో ఒకసభజరిగింది. 'ఉత్తరదేశంనుంచి యెవరువచ్చినా వాడికి మద్రాసుసెంట్రలుస్టేషనులో అఖండమైనస్వాగతంయిచ్చి పుష్పమాలాలంకృతుణ్ణి చెయ్యటం మనకు అనాదినుంచీ ఒకఆచారమైపోయింది. దక్షిణదేశంనుంచి యెంత గొప్పనాయకుడైనాసరే ఉత్తరదేశంగాని కలకత్తాగాని వెడితే వాడికి స్వాగతం యివ్వటానికి ఒక్కపిట్టకూడావుండదు. చివరికి వాడిమొహం చూసేవాడుకూడా వుండడంలేదమ్మండీ.

ఇకముందు దక్షిణాదివాళ్లు ఉత్తరాదివాళ్ళకు పల్లకీమొయ్యరు అని సేన్ గుప్తాగారికి నేను అభయహస్తం యిస్తున్నాను అని ఆసభకు అధ్యక్షత వహించిన సత్యమూర్తి అన్నాడు. సభలోని జనమంతా సత్యమూర్తిగంభీరోపన్యాసానికి పులకాంకితులైపోయారు, సేన్‌గుప్తాగారు పాపం బిక్కమొహం వేసుకుని వెల్లబోయారు. ఆ అరవడింఢిమభట్టు మాటలు నేటికీ నాచెవుల్లో ప్రతిధ్వనిస్తునే వున్నాయి!

## మందలింపు

సోషలిస్టు నాయకుడైన బాట్లివాలాని మద్రాసుప్రభుత్వం ఇండియన్ పినల్‌కోడు 124 ఎ సెక్షను రాజద్రోహనేరంక్రింద అరెస్టుచేసి, ఆరునెలలపాటు శిక్షవిధించింది; అప్రసిద్ధపురుషుడికి ప్రస్తుతం బెంగాలు ప్రభుత్వంవారిచేత అదే గతిపట్టింది. ఆసందర్భంలో అప్పుడు మద్రాసుప్రధానిగావున్న రాజగోపాలాచారి 'ఏవిధమైన పనిపాటలులేని ఉత్తరాది ఛోటానాయకులు మద్రాసువిచ్చేసి ఇక్కడ ప్రజలలో అలజడి, అసంతృప్తి అనవసరంగా కలిగించి ప్రభుత్వశాసనాలు దిక్కరించమని ప్రజలకు దుర్బోధచేస్తున్నారని' చల్లగా మందలించాడు. ఇంతనిర్భయంగా ఉన్నది ఉన్నట్లు చెప్పటం మన ఆంధ్రనాయకులకు చేతకాదేమో అనిపిస్తుంది.

## ఆంధ్రరత్నాన్ని సానతీర్చాలి

ఆంధ్రశక్తి అనేకశబ్దములలో అమోఘమైనశక్తి కద్దు. తెలుగుదేశానికి ఆంధ్రపద మమర్చింది విజ్ఞానముగల మహనీయులే. ఈ ఆంధ్రదేశవిషయం కొంచెము విచారిద్దాము. ప్రాచీనకాలము నాటి ఆంధ్రప్రభకు ఆధునికకాలము నాటి ప్రభ తీసిపోలేదు. అయితే వర్తమానకాలములో మాత్రము వన్నెతగ్గింది. జాతిరత్నం ప్రకాశం మారుతుందా అంటే సానతీర్చకపోతే తగ్గుతుందనే చెప్పవలెను. ప్రాచీన ఆంధ్రకళలో లలితకళలు విచారిస్తే శిల్పముగాని కవిత్వముగాని గానంగాని ఒకదానికంటె మరి ఒకటి ప్రకాశించాయి. అసలు ఆలోచించితే వ్యక్తులలోనుంచేగదా యివన్నీ బయలుదేర్తాయి. చూడండీ! ఆంధ్ర తేజం! బొబ్బిలిక్షాత్ర తేజం, పల్నాటి బాలచంద్రుని ప్రతిభ, ఓరుగల్లుయుగంధర రాజతంత్రలౌకికం, కృష్ణదేవరాయల భాషాపోషకత్వం- పురుషప్రభ అట్లావుండనివ్వండి స్త్రీలలో యెంతటి వీరమాతలున్నారో యీదివ్యశక్తులకు మున్ముందు వందనాలాచరిస్తాము. అప్పటి స్త్రీలల్లో ఆంతటిదైవికంకలదు గావునవే కన్నబిడ్డలు గంభీరభావాలకు నిలయులయ్యారు- అయితే వర్తమానకాలంలో లేరని తలచవద్దు. కొంచెము వెనుకటి దైవికమైన ధైర్యంతగ్గిందని తలంపు. భగవంతుడు మా ఆంధ్రులయందు దయవుంచి విద్యాపరితాపాదులు పరిసాదించుగాక!

—పేరక తాతయ్య.

# వెంకన్న తాత కుక్క

(33౨-వ పేజీ తరువాయి.)

టంతో ఒక్క ఉదుటున ఆగోతి లోకి దూకాను.

అలా దూకి, తల్లిపులొస్తుందన్న నాభయంకొద్దీ, నా ఆత్రుతకొద్దీ ఆమూడు పిల్లల్నీ, త్వరగా త్వరగా నడుముక్కట్టిన కండువావిప్పి అందులో పెట్టి నాలుగు చెంగులూ కలిపి మూటలాపట్టుకుని ఒక్క చూపు పైకి చూచాను ఎక్కేద్దామని. అంతే ఆచూపుతో అదివరకు మనస్సునావరించుకుని ఉన్న మాయ, మైమరపు గుండుదెబ్బకి రవీమని ఎగిరిపోయినట్టయింది. మెదలో ఏదో మెరుపుదెబ్బ కొట్టినట్టు కొట్టింది. ఒక్కక్షణంలో బిత్తరపోయాను. తలమీద పిడుగుబడ్డట్టయింది. నా తెలివితక్కువ నా కళ్ళెదుట నాట్యంజెయ్యటం మొదలు పెట్టింది-

దిగేటప్పుడు ఎక్కేసంగతి, ఎక్కే సాధనం, ఈగొయ్యిపై కెక్కి రావడానికి వీలుగా ఉందా లేదా అన్న కాస్తంత యోచనన్నా కలుగలేదు. పులిపిల్లలవుపడ్డాయన్న ఉత్సాహమే, వాటిని ఏసర్కసువాళ్ళకో అమ్మేసి డబ్బు మూటగట్టుకోవడం ఉబలాటమే అయితే మట్టుకు- ఇంత బుద్ధిలోపమే! ఇంత తెలివితక్కువే! ఇంత మైమరపే! ఇలాంటి పొరబాటే! పీక నులిమేసుకునే బుద్ధిలోపమే! తలెగిరిపొయ్యే తెలివితక్కువే! ప్రాణం బలియిచ్చే పొరబాటే! ఈపని పుర్రెలో మెదడున్న, మానవుణ్ణైన నేను చేసినపనే! ఈమానవు డప్పుడప్పుడూ చేసే కొన్ని పొరబాట్లకి బుద్ధిలోపాలికీ అంతూ, లోతూ, లేదేమిటి?

ఇప్పుడు నాకీ వేదాంతమంతాను. అప్పుడీ యాలోచనలెక్కడ? ఈవేదాంతమెక్కడ? దిగిన ఉత్సాహమంతా ఎక్కలేని భయోత్పాతంలో, రానున్న మృత్యుప్రళయంలో, తుపానులో దూదిపింజలా ఎగిరిపోయింది. ఆ స్థానంలో ఒక గాఢమైన భయం— చెప్పరాని ప్రాణభీతి ఆవేశించాయి. మెదడులో ఆలోచనలన్నీ నశించి ఒక శూన్యం ఆవరించుకుంది. అలా బహుశ 10, 15 నిమిషాలువుంటుంది. అప్పటికి ఆభయంతోనే కాస్త మరపులోనుంచి తెలివిలోబడి మనస్సు కూడబెట్టుకుని గొయ్యంతా కలయజూడ్డం మొదలెట్టాను. ఎక్కడన్నా ఒక చిన్న రంధ్రం ఆగోతి గోడని ఒక గూడులాంటి గొయ్యి, లేక ఒక చెట్టు వేరుగాని, ఒక డొంక తీగగాని కనపడతయ్యేమోనని- నా ప్రాణం రక్షించేవి.

ఊహూ! ఎక్కడా మాట్లాడ గూడదు. నున్నగాసిమ్మెంటు చేసినట్టుంది. గొయ్యంతాను. ఏమట్టయినా అయితే చేతుల్తోనయినా కాస్త మట్టి కెక్కరించి ఎక్కడానికి కాస్త గూడు లాగయినా చేసుకోవచ్చు. కాని కఠినపాషాణం. పైకి చూశాను ఏవన్నా కొమ్మలురెమ్మలు తీగలు కాస్త ఎగిరితే చేతికందేటట్టున్నయ్యేమోనని. అవిగూడా ఎక్కడాలేవు-ఎక్కడో నా కందని పై అంచుల్ని తప్పించి- నాపాపిష్టి మతి.

పోనీ ఆతుపాకీతో నయినా దిగానా. కైజారుతోనన్నా దిగానా! ఆతుపాకి కుందాతోనో, ఆ కైజారుతోనో ఒకటిరెండు చిన్న గోతులుచేసుకుని ఎక్కిరాగలిగుందునే. ఈ నా పరీక్షంతా- ఇంతసేపు వర్ణించానుగాని- ఒకటి రెండు నిముషాల్లో అయిపోయింది.

ఇక లాభంలేదని నిరాశచేసుకుని రాబొయ్యే ప్రళయాని కెదురుచూస్తూ, చేతులో వేళ్లాడుతూ ఉన్న ఆపిల్లల్ని కిందపడేసి. మీ మూలాన్నేగదా నాకొంపింత కూలింది అనుకుంటూ, నిలవబడ్డానికి గూడా ఓపిక లోపించి ఆగోతిలో అలా కూలబడ్డాను.

ఏదో ఆలోచనమీద ఆలోచన, ఆ ఆలోచనలవెనుక శూన్యం. చలనంలేని శూన్యం. ఆపులిని, అది మీదబడ్డాన్ని తలుచుకుంటే వొళ్లు కంపమెత్తిపోయి, ముచ్చె

మటలు పోసేస్తున్నాయి.

మనస్సంతా బ్రహ్మాండమైన భయావేశంతో ఊగిపోతూఉంది. మరుక్షణం నిశ్చైతన్యంగా నిలవబడిపోతూఉంది. ఆటయములో నా కళ్లు చూస్తున్నయ్యా, నాచెవులు వింటున్నయ్యా అని నాకు సందేహం. భరించలేని ఈప్రాణభీతి బాధకంటె వెంటనే ఆపులివచ్చి వొక్కసారిగా చంపేస్తే బాగుండుననిపించింది. ప్రాణపోకడ కంటే పోతుందనే భీతి ఎంతదుర్భరమో ఆనాడు అనుభవానికొచ్చింది. ప్రాణంపోవడం ఇంతబాధగా ఉంటుందా అనిపించింది. ఎంతయినా వొక నిముషంలో ముగిసిపోతుందిగా. ఈభీతి అలాకాక్కదే ఇంతని చెప్పలేనంతసేపూ నమిలేస్తూనే ఉంటుందే.

ఇక తలపులా వొక్కటేతలపు. ఆ ఆపులి రావడం. అందులో క్రొత్తగా యీనినపులి. మనుష్యుణ్ణి పసికట్టడం. అడివి దద్దరిల్లేటట్టు వొక్కసారి గాండ్రించడం. వొక్క గెంతుతో గోతిలోకిదూకడం. నన్ను తనపిల్లల్ని- తనుక్రొత్తగా కనుకున్న ముద్దుబిడ్డల్ని- అపహరించడానికొచ్చివ, హానిచెయ్యడానికొచ్చిన నన్ను అతి భయంకరంగా చీల్చి, చెండి, చంపి నారక్తపానంచేసి నాశవంతో చెలగాటలాడ్డం. ఎన్నిసార్లు తనుచంపిన జంతుకళేబరాల్తో పులి చెలగాటలాడ్డం చూడలేదు నేను. ఇవే నా కళ్ళముందు గంతులేశే దృశ్యాలు. నా తెలివితక్కువకి నన్ను నేనే తిట్టుకుంటూ దీనంతకీ కారణమైన పులిపిల్లల్ని తిడుతూ, అపశకునం పలికిన ఇంటిదగ్గరాడదాన్ని తిడుతూ, ఎదురొచ్చిన పిల్లిని తిడుతూ అలాపై చూపులు చూస్తున్నాను అర్థంలేకుండాను.

ఇంతసేపూ నావిపరీతావస్థలో నేను పడిపోయి నాభైరవుడున్నాడన్న సంగతిగూడా మరిచిపోయ్యాను. నేనెంతసేపటికీ పైకిరాకపోవడంచూసి కాబోలు మాభైరవుడు లోపలికి తొంగిచూచాడు. ఆశబ్దానికి నేనూ ఉలిక్కిపడి- పులి ఉలుకేగా ఎంతసేపూను లోపల- భైరవుడేనని చూచి తమాయించుకుని భైరవుడివైపు చూచాను ఎంతో దైన్యంతోను, సంకటంతోను. భైరవుడూ ఈవేళతో నీకూ నాకూసరి, మనరుణం తీరిపోయిందన్నట్టు. దాంతో నా వెలవెలబోయే ముఖంలో, దైన్యంనిండిన చూపుల్లో నాభైరవుడు నాస్థితిఅంతా- నా అసహాయస్థితి, అపాయస్థితి-అర్థం చేసుకున్నాడు గాబోలు పూర్తిగాను. వెంటనే తలదిగాలు వేశాడు. మామూలుగా ఉండే ఆ కళ్ళల్లో వొకవిధమైన జాలి, నిరుత్సాహం, నాకుగాను పడే ఆత్రుత నిరాశ నిస్పృహా అన్నీ వొక్కసారి అలుముకున్నాయి. అలాచూచి వొకటిరెండుసార్లు మూల్గాడు ఏదో బాధపడుతూఉన్నట్టు- నీ

సంగతి నాకు బాగా అర్థమయిందిలే అని నాకు చెప్తున్నట్టు. ఆహా! నాభైరవుడికి నామీదెంత విశ్వాసం, ఎంత ప్రేమ! ఎందుకో నన్ను గురించి మాభైరవుడికంత ఆందోళనా, బాధా.

ఇంతట్లో దూరాన్ని గాండ్రుమని వినబడ్డది. ఎగిరి గెంతినంతగా వొక్కసారి త్రుళ్ళిపడ్డాను. ఇంకేముంది? మన కీలోకంలో నూకలు ఈబొందితో బంధం ఘంటల్లో పోయి నిముషాల్లో కొచ్చింది. ఇంకో నిముషానికో, రెండు నిముషాలకో ఈజీవిత మిక సరి. ఈగోతి కిక్కడ బలి. అంతే అంతే! మరణదేవత, యమకింకరులు భయంకరాకారంతో అడ్డం మొదలుపెట్టారు నా కళ్ళెదుట- రక్తవర్ణంతోనూ, నీలాంబరాలతోనూ! ఆభీతితోనే అనిస్పృహతోనే అశూన్యదృష్టితోనే వొక్కసారి పైకిచూచి భైరవా అని వొక్క కేక వెయ్యకుండా ఉండలేక పోయాను- మూల్గా కేకా అన్నట్టుగాను, భయము బాధా కలిసి పైకితోసుకొచ్చినట్టుగాను.

ఆగాండ్రుశబ్దంలో భైరవుడు గూడా అదిరిపడ్డట్టున్నాడు. అదిరిపడి తేరుకున్నాడు గాబోలు. అప్పుడు భైరవుడికళ్ళల్లో వొక చైతన్యం, ఒక మిల మిల, వొక కాంతి మెరిసాయి- వేటలో జంతువుని చూసినప్పటిలాగ. భైరవుడలా తేరుకునేసరికి, నామెదలో మొలిసింది వొక ఆశాలత. ఇదే ఆఖరుఆశ. ఆఖరుఅధారం. వొక్కటేఆశ. వొక్కటే ఆధారంగూడానూ. నన్ను నాభైరవుడు కాపాడగలడేమోనని, ఎలాగైనా ఈభయంకరమృత్యువునుండి. ఈ భీకర వ్యాఘ్రకరాళదంష్ట్రిలనుండి తప్పించగలడేమోనని !

మళ్ళీ నిరాశ. పాపం భైరవుడు మాత్రం ఏం చెయ్యగలడు? ఎలా తప్పించగలడు ఏమాత్రమూ వొకరు తప్పించగలిగే స్థితిలో లేమే మన మని. మళ్ళీ వొకసారి పైకి చూచేసరికి- మళ్ళీ వొక ఆశాకిరణం. ఈసారి భైరవుడిలో వెనుకటికంటె చైతన్యం. అతడి కళ్ళల్లో వెనుకటికంటె విశ్వాసం కనుపించాయి నాకు. ఏదో నిశ్చయాని కొచ్చినట్టుగా కనుపించాడు నాకు భైరవుడు-ఆ ఆకారంలోను, ఆచలనంలోనూ.

ఇంతలో ఇంకొంచెం దగ్గరగా మరొక గాండ్రుశబ్దం వినిపించింది. ఇంకొక అరనిముషానికి ఇంకొకటి. దాంతో నాకు పూర్తిగా మతిపోయింది. బుద్ధి శూన్యమైపోయింది. నావొళ్ళు నాపట్టుతప్పి పోయింది. ఇంకొకలోకంలోకి ఎగిరి పోతూన్నట్టనిపించింది. యుద్ధభూమిలో, శత్రుపక్షంవారి షెల్సు వొక్కొక్కటి తనకు దగ్గరదగ్గరగా పడి ప్రేలుతూఉంటే కదలమెదలలేని సైనికుడిలా ఉంది నా స్థితి అప్పట్లో. నాలుగోషెల్లు(గాండ్రు) నానెత్తినపడి నేను సహస్రభిన్నాలై పోతాను. ఈప్రాణ మేలోకంలోకో, ఈ కళేబర మేకడుపులోకో. నేను దొంగిలించదలచు

కున్న ఈపులికూనలే ఇంకొక క్షణానికి నార క్తంతో, నామాంసంతో విందుగుడుస్తూ ఉంటాయి. ఇలా అనుకుంటూ అపడబోయే పిడుగుకోసం కాచుకూచున్నాను.

కాని ఆపిడుగు పడలేదు. నాలుగోసారి పులి అరిచి గోతిని సమీపించేలోపునే మాభైరవుడొక్కసారి విజృంభించి భూమి అదిరిపోయేటట్టు, అడివి దద్దరిల్లేటట్టు భీకరంగా మొరిగి అలా మొరుగుతూనే వొకదూకు దూకాడు పులి వచ్చేవైపుకి. ఇంతవరకూ మాభైరవుడంతలా నవనాడులూ, సర్వేంద్రియాలూ కూడదీసుకుని గర్జించడం వినలేదు నేను. ఆ తర్వాత గూడా వినలేదు. అలా దూకినవాడు మరినాకు కనబడలేదు. ఆ మొరుగు వెనక్కాలే పులిగాండ్రు శబ్దం. ఈసారి వెనకటికంటె దగ్గరగా వినిపించడం మాని నేనున్న చోటికి కొంచెం దూరంగా వినిపించిందని నాభ్రమ. భ్రమో నిజమో ఇంకొకసారితో తేలాలి. మరునిముషానికి ఇంకాకొంచెం దూరమైంది ఆపులిగర్జన. మా భైరవుడి మొరగడంగూడాను. దూరదూరంగా పోతూ వినబడుతూఉంది వొకజంతువు ఇంకో జంతువుని అతి తీవ్రంగా తరుముతూ ఉన్నట్టయే శబ్దం. ఎండుటాకుల మీద పరుగెడుతున్న ఆచప్పుడు వినబడుతూనే ఉంది- క్రమక్రమంగా తగ్గిపోతూనూ. అమ్మయ్య అనుకుని ఇంకొక కొన్ని ఘడియలీ ప్రాణానికి పరిమితనుకుంటూ వొక పాతికభాగం ఈప్రపంచంలోపడ్డా.

హృదయంలో వొక చిన్న ఆశాజ్యోతి వెలిగింది. రక్షింపబడగలనేమోనని. కాని వెంటనే ప్రశ్న ఎలా అని? అవును నిజమే ఎలాగు?

మాభైరవుడుమాత్రం పులిదృష్టిని నానుంచి తప్పించేసి. తనమీది కాకర్షించుకొని ఆపులినిఅలా లాక్కెళ్లాడు. అంతవరకు బాగానే ఉంది. కాని నేను తప్పించుకునేదెట్లా నే నీలోపున బయటికి ప్రాకగలిగితేగదా నాభైరవుడి ఈప్రజ్ఞకి, ఈ ఘనకార్యానికి సాఫల్యం. అదేగా అసలు సమస్య నేను బైటికిరావడం. రాగలననేగాబోలు, తను పులిని తిప్పలుపెట్టి తిప్పేలోపుగా నేను బయటపడగలననే గాబోలు నాభైరవుడి ఆశ. పాపం. ఎంత వెర్రి అమాయకత్వం. కాని యిలానన్ను రక్షించబోయి తను గూడా ఆహుతైపోడుగదా ఆపురిటింటి పులిచాన ప్రచండక్రోధానలజ్వాలకి.

పోనీ ఏమన్నా దారిదొరుకుతుందేమో ఏదన్నా కొత్త ఉపాయం కొత్తసాధనం. కనబడుతుందేమోనని తిరిగి ఆగోతిని, అడుగుభాగాన్ని, గోడల్ని, పైభాగాని అంతా అతి సూక్ష్మంగా పరిశీలించాను. ఉహూ వొకలవలేశం సందుదొరికితేనా. దారీలేదు- తెన్నూలేదు. రెట్టించిన నిరాశతో నిస్పృహతో మళ్ళీ కూలబడ్డాను మనగతింతేనని. విధికి తలొగ్గి.

క్రమక్రమంగా జంతువుల పరుగుశబ్దం తగ్గిపోయింది. ఆఅడివిలో ఏమూల ఎంత తిప్పలు బడుతున్నాడో నాభైరవుడు ఆబెబ్బులితోటి.

—సశేషము.

# రాజ్యశ్రీ

(౩౨౮-వ పేజీ తరువాయి.)

రామ :

నీకింక తెలియలేదూ ? ఒకరి విషయాలు తెలుసుకోనడానికి, లోకంలో క్రొత్తరకపు జబ్బులు, వింత వింత విషయాలు అమలులోనికి వస్తున్నై. ఆయా ఇబ్బందులు తొలగిపోయేటంతవరకు ఆయారోగాలు తాత్కాలికంగా కనుపించినప్పటికీ, ఏసుశ్రుతుడుకూడా ఒక ఆసవంగాని, ఒక అరిష్టంగాని, లేహ్యంగాని, చెప్పినవాడు కాడు.

వెంక :

ఏవిధంగానైనా అనుకోండి. నాకు చెందినమాటలు నాకు వినబడుతూ ఉంటవి, పరాయిమాటకు మాత్రం నాచెవులు గోడలు.

కర్పూ :

ఉన్న సత్యాన్ని వెల్లడించావు, వడ్డీవ్యాపారానికి అలవాటుపడ్డ వాడివైనా !

రామ :

ఐతే ఈవడ్డీవ్యాపారాల వాండ్లకు తాల్చిపోశేడు సుమా !

కర్పూ :

నిశ్చయంగా ! ఐతే, వెంకటయ్యా ! నీకెంత నష్టం !

వెంక :

(కోపంతో) ఊరిక, నేను దొరికాను మీనవ్వులాటకు? చూడటానికి అందరూ దేశోద్ధారకులే! రైతునాయకులే! స్వసంఘాభిమానులే! పగలదీసి చూస్తే బయటపడతై, కవిలెకట్టలు, వడ్డీబేరాలతో తీసిన కొంపలు, కాల్చిన పేదవారి కడుపులు—నేను కనుపించాను చివరకు ?

కర్పూ :

కోపమెందుకు వెంకటయ్యా ! ఉన్నమాటంటే ఉలుకెందుకు ?

వెంక :

ఉన్నమాటన్నారా ? అయితే నేను అడుగుతాను, ఇంకా, ఇంకా, ఈవడ్డీవ్యాపారాలమీద పడి ఆక్షేపించకపోతే—మీవంటి పెద్దలు, బుద్ధిమంతులు, పరాయివాండ్లను చూచి, పచ్చిబోగంతరహాగా మారిపోతూన్న ఈ తెలుగు సంఘాన్ని మరమ్మతు చేయరాదూ? అది చేతకాదు ! ఇంట్లోజవాబు చెప్పలేనివారంతా, బయట దేశనాయకులు, నన్నూరికె కదిలించవద్దు, అసలే కంప, కంప.

కర్పూ :

ఓరి వెంకటయ్యా ! కొంపతీశావే! అసలు జాతికే ఎసరెట్టావే!

రామ :

వెంకటయ్య తెలివితక్కువగా మాట్లాడినాడనుకున్నావా? నిజంగా ఈ తెలుగు జాతికి రాను రాను, తెగులు పుట్టింది. చూడు! ఇంత మంది అరవ వారిని, మళయాళం వారిని, వంగదేశం వారిని చూస్తున్నాము, ఎవరివద్దనైనా మన తెనుగుజాతికున్న అనుకరణజాడ్యం ఉన్నదేమో చూచావు ? వ్యక్తిత్వం, స్వతంత్రమైన ఆశయాలు లేని జాతి, కాలంగడచిన కొలదీ క్షీణించిపోతుంది; ఇతరజాతులను అనుకరించడంవలన కొన్ని సంవత్సరాల కాయాజాతులలో లీనమైపోతుంది. వ్యక్తిత్వము ప్రతిజాతికి వెన్నెముకవంటిది. ఆవెన్నెముక ప్రస్తుతం లేదు మనజాతికి. మనము తెనుగువారమని చెప్పకోనడానికి వీలున్న ప్రత్యేక లక్షణాలన్నీ, అనుకరణజాడ్యం వలన హాతమారిపోతున్నై. పరాయి జాతులను ఈవిధంగా ఏజాతి, అనుకరించడంలేదు రక్తంలో ఉడుకు, కండరాలలో బలము, మెదడులో శక్తి, కన్నులలో కాంతి మనకు తగ్గిపోతున్నై. మనపూర్వవైభవాన్ని మరచిపోయినాము. వెంకటయ్య పిచ్చివాడై అట్లా మాట్లాడలేదు.

కర్పూ :

ఒక్క కట్టూ బొట్టూ మారినంతమాత్రంలో జాతి క్షీణించిపోతుందా ?

రామ :

ఆమాట ఈ తెలుగు గడ్డమీద నిలిచి అనగలిగినావుగాని, ఏ వంగదేశమో వెళ్ళి, వాండ్లకట్టుబొట్టు

ను గూర్చి ఇంత చులకనగా మాట్లాడినావంటే, ఈపాటికి చెంపఛెడేలు మనేది! కట్టూబొట్టూలోనే ఒకజాతిని అనుకరించాలనే చచ్చుబుద్ధి నీకు పుట్టినపుడు, ఇంక పెద్దవిషయాలలో నీగతి కక్కలపాలు, నక్కలపాలు. ఇల్లు దిద్దుకోలేని, వాజమ్మవు, రాజ్యమేమి దిద్దుతావోయి!

వెంక :

అట్టా కొట్టు! మరీ వేలం వెఱ్ఱి అయిపోయింది.

కర్నూ :

మనలాగు వేషాలుమార్చేవారు దేశంలో లేరంటావా ?

రామ :

మందులోకి కూడా లేరు. అంతదాకా ఎందుకు, మన తెలుగు దేశంలో కాపురముంటున్న, అరవవారు, ఎన్నడైనా మనలాగు చీరెగాని, ఇతరవేషంగాని మార్చినట్లు చూచావు? వ్యాపారానికి వచ్చే కాబూలువాండ్లు, ఉత్తర హిందుస్థానంవాండ్లు మానలాగా మారిపోయారేమో విచారించావూ? అంతదాకా ఎందుకు? మన తెలుగు దేశంలో పూర్వంనుండి, ప్రతిగ్రామంలోను ఇండ్లు కట్టుకుని, వ్యవసాయం, నౌకరీలు చేసుకుంటూ, మనతో అన్ని వ్యవహారాలలోను కలిసిమెలసి ఉంటున్న మన సాహెబులు, ఏనాటికైనా ఆ కుచ్చుటోపీని, ఆరంగు రంగు బట్టలను, ఆ చెవులపోగులను, ఇండ్లకు ఎఱ్ఱమట్టి, తెల్లచుక్కలను, మఱచిపోయినారేమో చూచావు! మనలాగున్నది ఏజాతి లేదు, మార్వాడి కట్టు, కాశ్మీరపుజుట్టు, సాహెబు గుడిగి, అరవవాని గూడకట్టు, ఎన్ని ఎన్ని! ఛీ! వీర్యంలేని జాతి మనది. ప్రతి జాతిలోను అనుకరణ జాడ్యంతో అవసరనడే చవట లుండకపోరు, కాని మనజాతిలోనే ఆచవటలసంఖ్య దినదినము అభివృద్ధిలో నున్నది.

కర్నూ :

ఐతే! మనవారందరినీ పూర్వకాలంలో ఎట్లా ఉన్నారో అట్లా ఉండమనియా నీ అభిప్రాయం ?

రామ :

మనజాతిని, మార్పులు లేకుండా పాషాణంగా పడియుండమని నేను కోరటంలేదు. మన హృదయానికి, మన విజ్ఞానానికి, అనుకూలమైన మార్పులను మనం తెచ్చిపెట్టుకోరాదని ఎవరనగల్గుతారు? మన తెలివిని మన ముపయోగించుకొని బాగుపడటం యుక్తమైన విషయము, అంతేగాని తెలుగువాడంటే, ఇతరజాతుల పోకడలను అనుకరించి, బ్రతుకుతూ ఉన్న, వ్యక్తిత్వంలేని చచ్చు పెద్దమ్మ అనేపేరు మనకు రాకూడదు.

కర్నూ :

నాకిపుడు తెలిసింది! అసహ్యకరం, క్షణభంగురము, అయిన ఆత్మానందము కొఱకు, పరాయివారిని అనుకరించకుండా, స్వశక్తిని, స్వబుద్ధిని, వినియోగించి, తెనుగువాడు బ్రతకవలె, అని కాదా ఈగోలంతాను ?

రామ :

ఔను.

(ఇంతలో గోపన్న ప్రవేశము.)

గోపన్న :

విన్నారా! ఇంకా ధర్మమున్నది! రాజ్యవర్ధన మహారాజు, మాళవరాజును ఘటామనిపించి, రాజ్యశ్రీ దేవితోవస్తున్నారట.

రామ :

ఏలా తెలిసింది?

గోప :

అంచెలమీద వార్తవచ్చినది. ఈవిషయం రాజ్యమంతా తెలియటానికి, సంతోషాన్ని వెల్లడించడానికి ఒకఉత్సవం మనగ్రామస్తులు జరుపనున్నారు, మనమంతా బజారుకేసి వేళ్దాము కదలండి.

కర్నూ :

రాజ్యవర్ధన మహారాజు ఇంకా ఈగ్రామం రావడానికి, అభ్యంతరమేమిటి?

గోప :

మధ్య ఒకగ్రామంలో విశ్రాంతి తీసుకుంటున్నారు. అందరము బజారుకు వెళ్దాములేవండి.

రామ :

మంచిది. (అందరు నిష్క్రమింతురు.)

—తెర—

—సశేష

**3, 4 రోజులనుండి పావలాడబ్బులుకూడా చేతిలో పడటంలేదు.**

# నిరుద్యోగి నిర్వేదం

[చిన్న కథ]

'ఇంట్లో గుప్పెడు గింజలు లేవు. చంటిపిల్లాడికి పాల డబ్బా లేదు. ఎల్లాగయినా అవసరముంది. తీసుకు వెళ్ళండి. దీనిని అమ్మి డబ్బు తీసుకురండి ...... అతడు చూస్తుండగానే ఆముష్టివాడు పదిమంది దగ్గర పది డబ్బులను సంపాదించి సంతోషంతో ఇంటికి వెళ్లుతున్నాడు.'

రచయిత :

## ఆకెళ్ల గోపాలకృష్ణశర్మ

౧

దాస్యభావాన్నీ, దారిద్ర్యాన్నీ ప్రసాదించే విద్యార్జనకోసం ఆస్తి చాల వఱకు సన్నగిల్లింది. మిగిలినది ఉద్యోగ సంపాదనకొఱకు, తత్ప్రియత్నాలకొఱకు నశించడం ఆరంభించింది. శరీరాన్నీ, ధనాన్నీ, ఆరోగ్యాన్నీ, ఖర్చుచేసికొని సంపాదించుకొన్న విశ్వవిద్యాలయ బిరుదముమాత్రమే మిగిలినది. కష్టనష్టాల్లో సహధర్మచారిణిఅయిన అర్థాంగివుంది. ఆదంపతుల ప్రేమఫలితంగా యిద్దరు బిడ్డ లుదయించారు. భార్యాభర్త లిద్దరూ పస్తుపడుకొన్నా, పిల్లలక్షుత్తును తీర్చడానికైనా చేతకాకుగూడా లేని దీనస్థితియందున్నారు.

యీ యాతనామయప్రపంచంనుండి విరమించి శాశ్వతసౌఖ్యాన్ని అనుభవించాలని అహరహమూ తలచేవాడు రామారావు. కాని—పతిప్రాణ—ప్రేమైకనిధానయగు అర్థాంగి కేదిదారి? ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డల భావిగతి యెల్లాగ? పోనీ—తాను బ్రతికివుండి భార్యనూ, పిల్లలనూ సంతోషపెడుతున్నాడా? కడుపునిండా అన్నమైనా పెట్టలేని అధమస్థితియందు తగుల్కొన్నాడు, స్వతంత్రజీవనంవల్ల కుటుంబపోషణ చేసుకొంటూ భార్యాపుత్రులను సంతృప్తి పరచడము తనకీ జన్మయందు లేదు.

పోస్టాఫీసుదగ్గరకు వెళ్ళి టెలిగ్రాములను, మనియార్డరులను వ్రాసిపెట్టడము; రెండుమూడుకొట్లమీద జమాఖర్చు లెక్కలను వ్రాయడము; రెండుమూడు యిళ్లల్లో ప్రయివేటు ట్యూషనులు చెప్పడము-ఇదీ అతని దైనందిన జీవితమార్గము. ఇల్లాగ వివిధవృత్తులకూ ఆకరమయింది అతనిశరీరము. ఇన్నివిధాలుగా సంపాదిస్తున్నా యింటిఅద్దెకు, చంటిపిల్లవాని పాలడబ్బాలకూ చాలడంలేదు. భార్యాభర్తలకు నిరంతరోపవాసాలే ఆధారం. ఇప్పటికి నాలుగునెలల యింటిఅద్దె బకాయిపడింది. బియ్యపుకొట్టుమీదా, చిల్లరకొట్లమీదాకూడా బాకీ పెరిగిపోయింది. ఇంతకు పూర్వమున్నబాకీ జమకట్టితేనేగాని శేరుపప్పయినా యివ్వనని షావుకారు కఠినంగా చెప్పాడు. బజారువెంట వెడుతుంటే నాబాకీయిచ్చి మరీకదలమంటున్నాడు బియ్యపు కొట్టు ఆసామీ. నాలుగుమూడు రోజులనుండి పావలాడబ్బులుకూడా చేతిలో పడటంలేదు. ప్రయివేటు ట్యూషను చెప్పే స్థలంలో యింతకంటె తక్కువగా మరొకరు చెప్పుతుండడంవల్ల మానుకోమన్నారు. ఈ విషయాలన్నీ బుర్రలో తిరుగుతున్నాయి. బెజవాడ రైలుస్టేసులో రైళ్లలాగ తలకాయ వివిధాలోచనలతో నిండివుంది. రాలేక రాలేక బరువుగా యింటికివచ్చాడు.

నాన్నా! నాకు మిఠాయితీసుకో

చ్చావా? అంటూ పెద్దకుఱ్ఱవాడు ఎదురొచ్చాడు. చంటిపిల్లవానిని చంకనెత్తుకొని చిరునగవుతో, చారెడులోతుకుపోయిన కళ్ళతో యెదురయింది భార్య. నాయనా! రేపు కావలసినంత మిఠాయి తీసుకువస్తానులే అని పిల్లవానిని యెత్తుకొని యింటిలోకి వెళ్లాడు.

౨

'నరసింహారావుగారు ' రమ్మన్నారు గాదూ? వెళ్లారా?'

'ఓసీ వెఱ్ఱిదానా! పట్నవాసాలు స్వార్థపరత్వానికి నిలయాలు. ఇల్లాంటి చోట్ల బంధుత్వాలూ, మొహమాటాలూ పనికి వస్తాయా?'

'నూరురూపాయలూ తప్పకుండా యిస్తామన్నారు కాదండీ ?

'రూపాయలసంగతి అల్లావుంచి ఆదరంతో భోజనమైనా చెయ్యమనలేదు.'

'అయితే ప్రొద్దుటినుంచీ భోజనం కూడా చెయ్యలేదన్నమాటా?'

'అవును.'

ఈమాట వినడంతోటే ఆమెకంటివెంట వాన చినుకుల్లాగ నీటిబిందువులు గారాయి.

'ఏడుస్తున్నావా?'

'లేదులెండి.'

'కమలం! నన్ను పెళ్ళిచేసికోవడంవల్ల నీకుకూడా సౌఖ్యంలేదు. దారాపుత్రులను పోషించుకోలేని దౌర్భాగ్యుడను. నీవు మీపుట్టింటికి వెళ్లు.'

'మీరే నాకు సమస్తమూను. నేను మీదగ్గిరేవుంటాను.'

'ముందుగతియెల్లాగ?'

అని రామారావు అనడంతోటే అమ్మగా మిగిలి తనమెడలోవున్న గొలుసును తీసి అతనిచేతికిచ్చి 'దీనినమ్మి డబ్బుదీసుకురండి.' అని ధైర్యంగాపలికింది.

'వద్దు. ఇదివరకే అన్నివస్తువులూఖర్చయ్యాయి. మళ్ళీచేయించుకోగలమా? అయినా అంతఅవసరమేముంది!'

'ఇంట్లో గుప్పెడుగింజలులేవు. చంటిపిల్లాడికి పాలడబ్బాలేదు. ఎల్లాగయినా అవసరముంది. తీసుకువెళ్లండి.'

'నీవన్నం తిన్నావా?'

'లేదు. పెద్దవాడు చద్దిఅన్నంమాత్రం తిన్నాడు.'

ఈమాట అతనిహృదయమర్మానికి వజ్రాఘాతమయింది. భార్యకూ, కన్నసంతానానికీ తిండిపెట్టుకోలేని తన అప్రయోజకత్వానికి నిందించుకొన్నాడు. కాళ్లు మొహంకడుక్కొని తలదువ్వుకొని చొక్కాయొక్క చినుగులు కనపడకుండా కోటుతొడుక్కొన్నాడు. అప్పుడు సుమారు నాలుగుగంటలు కావచ్చాయి.

'నేను మళ్ళియిప్పుడే వస్తాను.'

'యీగొలుసమ్మి గుండెత్తుబియ్యం తీసికొని చిల్లరబాకీలు తీర్చిరండి.'

'వద్దు. భార్యసొమ్ముతో నాజీవితాన్ని భరింపను. బి. ఎ. ఫస్టుక్లాసులో ప్యాసయి సాంప్రదాయకుటుంబములో జన్మించి స్త్రీధనం వాడుకోనా? యీవేళ యిటోఅటో తేలిపోవాలి. భార్యాతృప్తి ; కుటుంబసౌఖ్యం పేదవానికీ, భాగ్యవంతునకూకూడా సమానములే' అని చరచరా వీధిలోకివెళ్లాడు.

చంటిపిల్లవాడు 'నాన్నా! నాన్నా!' అని చేతులుచాచి యేడుపుమొదలు పెట్టాడు.

'నాన్నగారు మళ్ళీరారటే అమ్మా!' అని పెద్దపిల్లవాడన్నాడు.

కమలమాత్రం యీమాటలను లెక్కచేయక, కడుపులో ఆకాశంఅంత ఆకలి ఆవరించినా, భర్త వెళ్లినమార్గం వెంట దైన్యంగా చూస్తోంది.

౩

గమ్యస్థానాన్ని నిర్ణయించుకోకుండా తారాచువ్వలాగ నడుస్తున్నాడు రామారావు.

'బాబూ!మమ్మల్ని మరచిపోయారు.' అని వీధిమొగలోవున్న షావుకారుపలకరించాడు.

రిక్షామీద కాఫీహోటలుకు వెళ్లుచున్న స్నేహితుఁడు రామారావును చూసి ఔన్నత్యసూచకంగా చిరునవ్వునవ్వాడు.

భార్యనూ, పిల్లలనూ కారులోకూర్చోపెట్టుకొని బజారువెంట షికారుచేయుచూ తన సహాధ్యాయి తనతో మాట్లాడలేదు.

'బాబయ్యగారూ!ముసిలోడిని. నిన్నరేతిరినుంచి తిండిలేదు. ఒక్కకానీ యిప్పించండి.' అని ఒకముష్టివాడు.

రామారావు సమాధాన మివ్వలేదు.

'తమరు మంచిప్రభువులు. మంచివుద్యోగస్థులు. ఒకకానీ' అని...

'నాదగ్గిర ఏమీలేదురా.'

మళ్లాముష్టివాడు :

సిగకొట్టు కొనుక్కున్నంత, నేదు బాబూ! తాంబూళం వూసేసినంతవుండను, నాయనా' అని తిరిగి ముష్టివాడు.

'అవునురా!నాదగ్గిరవుంటే యిద్దును.'

'బాబూ! అల్లాగఅంటారుగాని తమదగ్గిర లేకపోవడమేమిటీ! తమరు ఇచ్చేప్రభుల్లాగ కనిపిస్తున్నారు. అందుకని ఆశపడుతున్నాను.'

రామారావు సమాధానంచెప్పకుం-

తలవంచుకొని నుంచున్నాడు.

'మీపాదాలకి నమస్కారంబాబూ ఉపవాసం మూలానప్రాణాలు కడంటు తున్నాయి.'

'నాకూ ఉపవాసమే. నా మొర అలకిం చేవారెవరు?' అని లోపలఅనుకున్నాడు రామారావు.

'అంత మంచి ప్లీడరుకోటు తొడు క్కున్నారు. ఒకపైసాయైనా దయ చేయండి.'

రామారావు తనశరీరంవైపూ, వాడి శరీరంవైపు తేరిపారచూశాడు. ఇద్దరికీ మధ్యవున్న తారతమ్యాన్ని పరిశీలించా డు. తాను భాగ్యవంతుడవడానికి తాను ధరించినకోటు కారణమని గుర్తించాడు. వెంటనే ఆకోటు తీశాడు. లోపలవున్న చినుగుల చొక్కాచూసి ముష్టివాడు సిగ్గుపడి మరొకచోటకు వెళ్లాడు.

రామారావు చిత్రప్రతిమలాగ కొయ్య బారి నిలబడ్డాడు. అతడు చూస్తుండగానే ఆముష్టివాడు పదిమందిదగ్గర పదిడబ్బు లను సంపాదించి సంతోషంతో యింటికి వెళ్లుతున్నాడు.

రామారావు దీనంగా నీరసంగా కథ లలేక, మెదలలేక, కర్తవ్యజ్ఞానము సుత లామూ లేకుండా దీపస్తంభానికి సన్నిహి తంగా శరీరాన్ని చేర్చాడు.

మనసిచపరితృప్తేకోఽవాన్‌కోదరిద్రః.

౪

బీచిదగ్గర బ్రహ్మాండమైన సభజరుగు తోంది. మంత్రులు, శాసనసభ్యులు, పౌరులు ఆసభకు వెళ్లుతున్నారు. పాగా కుపన్ను, అమ్మకపుపన్ను మొదలగు వానిని సమర్థించుచు మహోపన్యాస ముల నొసంగుచున్నారు. కాంగ్రెసు మంత్రివర్గమువారు భావికాలమందు ప్రవేశపెట్టబోవు కార్యపణాళికను కొందరు సూచించిరి, ప్రభుత్వముయొక్క ఘనతను మరికొందరు కొనియాడుచుండిరి. ఆసభయంతయూ ఉత్సాహముతో నిండియుండెను. సముద్రమువంటి ఆసభ లోనుండి యొకడు 'నిరుద్యోగసమస్యను తొలగింపజేయడానికి ప్రభుత్వము వారొనరించుచున్న ప్రయత్నములేవి?' అని ప్రశ్నించెను.

'మీదారాపుత్రులను వీడి దేశదాస్య మోక్షానికి శరీరాలనైనా బలినివ్వండి. స్వరాజ్యం వచ్చిందంటే మన దేశంలోవున్న నిరక్షరాస్యత, నిరుద్యోగ సమస్య నశించిపోతాయి.' అని ధైర్యగంభీరంగా ఒకమహానుభావుడు ఉపన్యసించాడు. కరతాళధ్వనులు చెలరేగాయి. హర్షధ్వనులు ఆకాశంవరకూ వ్యాపించాయి.

౫

మరునాడు రామారావుఅను నిరుద్యోగి ఆత్మహత్య చేసికొన్నాడని అన్నిపత్రికలలోను ప్రకటింపబడినది.

---

౩౨౪-వ పేజీ తరువాయి.]

ఆగోరీనిపట్టి ఆతోటకు కురీ భాగ్ (పిల్లతోట) అనే పేరు వచ్చింది. మరి ఇరవై ఐదు సంవత్సరాలకు పిమ్మట అక్కడ కవుర్తల సంస్థానంవారు ఒక పెద్ద మందిరం కట్టారు. ఆమందిరంలో ఇప్పుడు స్త్రీల కళాశాల ఒకటి వుంది.

తనపేరిట నిర్మింపబడ్డ గోరీ ఆవరణలో ఇప్పుడు ఒక స్త్రీల కళాశాల వెలసినందుకు అల్లార్డు బాలిక ఆత్మ ఎంతగా సంతోషిస్తూ వుంటుందో కదా !

పాన్ దేవిని, పిల్లల్ని అల్లార్డు ఫ్రాన్సుకు తీసుకువెళ్లాడు. ఆమీద ఒకసారి అతడు ఒంటరిగా ఇండియాకు కార్యార్థిఐవచ్చాడు. తిరిగి ఆలుబిడ్డల్ని చూడకుండానే అతడు ఇక్కడ చనిపోయాడు.

అతని సంతతివారు ఇప్పటికీ కూడా ఫ్రాంసులో వర్ధిల్లుతూ వున్నారు.

కాని అనార్కాలి సంగతి, ఆమెగోరీ సంగతి, ఆగోరీమందిరంలో కాపరంవున్న పాన్ దేవి సంగతి, ఆమె బిడ్డలసంగతి ఇప్పుడు అందరూ మరిచిపోయారు.

అనార్కాలీని మరిచిపోయారు. అవును. ఐనా ఇప్పుడు ఎవరైనా సరే లాహోరు వెళ్ళి అనార్కాలి ఎక్కడ అంటే ఎవరుకాని ఆశ్చర్యాన్ని చూపరు. లాహోరులోని గొప్ప విపణివీధికి అనార్కాలి అని పేరు. అనార్కాలిబజారుఅని ఐనా అనరు. కేవలం అది ఒక్క అనార్కాలీ అనే పేరుతోనే వ్యవహరింపబడుతూవుంది. అనార్కాలి ఎక్కడ అనేవారికి లాహోరుపుర జనులు ఆబజారు చూపిస్తారు.

అనార్కాలి అన్న పేరు ఒక్కొక్కదినానికి లాహోరులో ఎన్నిసారులు అమ్రేడితమౌతుందో?

కాని అది లోకమోహనాకార ఐన ఒకానొక నట్టువరాలిపేరని కాని, ఆమెసమాధి ఆవూరిలో వుందనిగాని చాలామందికి తెలియదు.

# ప్రయత్నించిచూడు

పెన్సలు, కాగితం పుచ్చుకో.

ఇంగ్లీషుఅచ్చు అక్షరాల్లోని పెద్ద డీని (D) కుడిచేత్తో పెన్సలు పుచ్చుకుని కాగితంమీద వ్రాయడానికి ఆరంభించు.

కుడిచేత్తో ఆఅక్షరాన్ని వ్రాస్తూనే కుడిపాదంతో నేలమీద సున్నచుట్టడానికి ప్రయత్నించు,

రెండూ ఒక్కసారి చేయడానికి సాధ్యమౌతుందా?

పురె (ఎడమ) చేతివాటంగలవారు వ్రాత ఎడమచేత్తో వ్రాస్తారు కాబట్టి సున్నచుట్టడం ఎడమపాదంతో చేయాలి.

అయితే ఇంతకూ ఈరెండుపనులూ ఒక్కసారిగా చేయడం సాధ్యమౌతుందా?

ఏమో?

ప్రయత్నించి చూడు.

---

# ఆరోగ్యవిజ్ఞానం

పుక్కిలించి ఉమ్మడానికి నిమ్మకాయరసం చాలామంచిది.

నిమ్మకాయరసపు పుక్కిలింపు నోటి దుర్వాసన్ని పోగొట్టి నోటిని శుభ్రపరుస్తుంది.

టూత్ బ్రష్షుమీద కొద్దిగా నిమ్మకాయరసంపోసి పళ్లుతోముకుంటే పళ్ళమీది గారతొలగిపోతుంది.

... ... ...

ఆవాలు పట్టువేయవలసినప్పుడు ఆ ఆవాలను నీటికిబదులుగా కోడిగుడ్డు తెల్లసొనతో కలిపినూరి పట్టువేస్తే చర్మం పొక్కదు.

---

# విడ్డూరాలు

ఆఫ్రికాలో ఒకవిడ్డూరపుజాతి కప్పలువున్నాయి. వానితలలు చాలా చిన్నవి. ఒళ్లుమాత్రం బాగాకొవ్వివుంటుంది.

ఆజాతి కప్ప తలుచుకుంటే బాగా ఉబకగలదు. బాగా ఉబ్బినప్పుడు అది కప్పలాగున కాక కేవలం రబ్బరుబంతిలాగున వుంటుంది.

ఆకప్ప చర్మం చాలా మృదువుగావుంటుంది. దానినోరు ఇరుకుగా, నాలిక పొడుగుగా వుంటుంది.

ఆకప్పలకు చెదపురుగులు ప్రధానమైన ఆహారం.

... ... ...

ఇంగ్లండులోని ఇంపిరియల్ స్టేట్ కిరీటం 1838 లో చేయబడింది. అది తయారుచేసిన కంపెనీపేరు రండెల్ అండ్ బ్రిడ్జెస్. పాతకిరీటాలనుంచి తీసిన మణులతో అది నిర్మింబడింది. ఆకిరీటానికి ఒక పెద్దమాణిక్యము, ఒక పెద్ద ఇంద్రనీలమణి, పదహారు చిన్న నీలాలు, పదకొండు పచ్చలు, నాలుగు కెంపులు, 1363 పట్టైలుతీర్చి మిక్కిలి ప్రకాశమానంగా చేయబడ్డ రత్నాలు, 1273 గులాబిరంగు రాళ్లు, 147 టేబిల్ డైమండులు, నాలుగు చుక్కముత్యాలు, 273 ముత్యాలు పొదగబడివున్నాయి.



# విజ్ఞానవిషయాలు

రాగి మానవుడు ఆదిలో కనుక్కొన్న ఆరులోహాల్లోనూ ఒకటి. మధ్యధరా సముద్రంలోవున్న సైప్రస్‌దీవిలో రాగి మొదటిసారి కనుగొనబడిందని పాశ్చాత్యుల అభిప్రాయం.

... ... ...

రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యానికి రాజధానీ నగరమైన లండన్‌లో లండన్ లైబ్రెరీ అనే గ్రంథాలయం ఒకటి వుంది. అది 1841 లో స్థాపితమైంది.

ప్రారంభంలో దానిలో మూడువేల పుస్తకాలుమాత్రం వున్నాయి. ఇప్పుడు అది ప్రపంచలోని పెద్దగ్రంథాలయాల్లో ఒకటి. ఆగ్రంథాలయంలోని సభ్యులు వారంతటవారే బీరువాలదగ్గరకువెళ్ళి పుస్తకాలు తీసుకోవచ్చు.

లండన్‌నగరవాసులైన సభ్యులు ఒక్కసారి పదిపుస్తకాలవరకు పట్టుకునివెళ్ళవచ్చు.

గొప్ప ఆంగ్లగ్రంథకర్తలు, రాజకీయవేత్తలు ఆగ్రంథాలయంలో సభ్యులైవున్నారు. చారిత్రికగ్రంథరచయితలకు ఆగ్రంథాలయంలోని సభ్యత్వం అతి ముఖ్యమైంది. కార్లయిల్, మెకాలే, డికెన్సు, థాకరే మొదలయినవాళ్లు అందరూ ఆలైబ్రెరీకమిటీలో మెంబర్లుగా వుండినారు.

... ... ...

రేడియమ్ అనేది కొంచెం ఇంచుమించు పళ్ళపొడిలాగున వుంటుంది. కాని ఒకచిన్న గొట్టంలో రెండువేల పౌనుల విలువగల రేడియమ్ పెట్టవచ్చు.

# అబ్బా! ఎంత ఆనందకరమయివున్నది ఈ కాళరాత్రి

# కాళరాత్రి

ఆకాళరాత్రి :—

నాలుగువైపులా నల్లటి నాలుకలు చాచుకుని భయంకర మహాభూతంలా వుంది.

ఆమె వక్షస్థలంపైన కాబోలు! 'దగ ధగ' మంటూ నిప్పు దిక్కులెగ ప్రాకుతూంది.

నిశ్శబ్దమగు ఆసమయంలో పదధ్వనే హడలు పుట్టిస్తూంది.

వికృతంగాను, భయం గొల్పేవిగాను వినవస్తున్నాయి ఏవో అరుపులు.

దూరాన్న కొండలు, చెట్లు దట్టంగా ఒక్కటై 'దారి మరిలేదం'టున్నాయి.

మధ్య నేవో గొరవిదెయ్యాలు కాబోలు తమకే సంచారయోగ్యమన్నట్టు స్వేచ్ఛావిహారం సాగిస్తున్నాయి.

ప్రక్కప్రవాహము చావుమ్రోత లేస్తూ, ఎవర్నైనా చవిమాడాలంటూంది. గండశిలలకు తాకినప్పుడా చప్పుడు 'మట్టిపాలు చేస్తానం'టూంది.

ఎక్కడినుండో ప్రమాదస్థితిలో రక్షింపవేడుతూ ఎవరో కేక వేస్తున్నారు.

ఒక్కడునూ అగుబడలేదు రోడ్డు మీద.

నిన్నెవరైన 'తలమొత్తుతే, ఏంచేస్తావు?' అంటూ ప్రశ్నాకృతిలో వుంది ప్రకృతి.

అన్నీ ఏకమై మంటలువుటాయా అన్నట్టున్నాయి విద్యుద్దీపాలు.

నీడ ముందుకూ వెనకకూ చిన్నదీ పెద్దదీ అవుతూ రూపులేకుండా 'ఫే'డవుతూ జీవితధోరిణ్ణి చూపుతూంది.

చెట్లు భూతాల్లా మెడలువాల్చుకుని, జుత్తు విరబోసుకుని, 'ఊరుకున్నాం గానీ!' అంటున్నాయి.

పగలు ప్రపంచమంతా ఎంతఆనందపడినా రాత్రి మా ఆజ్ఞ వినాల్సిందే! అంటూ మాఆజ్ఞ తిరస్కరించిన మీబోంట్లు బ్రతికేదెన్నాళ్లు? అనే ధిక్కారము వినవస్తూంది.

అబ్బా! ఈకాళరాత్రి ఎంతభయంకరంగావుంది!

*      *      *

ప్రపంచాన్ని తలక్రిందుల చేయగలిగే తల వుందోలేదోకూడ తెలియకుండా చేస్తూంది.

మేమంతా యిప్పటే గానీ కూడలేము. మమ్మల్ని ఇంతవరకు వేరుచేసే మీకోరిక కేమనాలి? అని ప్రశ్నిస్తున్నాయి తారలు.

నానాలుక ఎన్నోరూపాలు పొందుతుంది. ఎంతో ఆనందాన్ని పొందుతారు. ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తారు.

వారికి నేనిప్పు డగుబడితే ఏమనుకుంటారు అని రజని మొరపెట్టూంది.

నీకులోకై వుండిపోయింది నేనే అంటూ అప్పుడప్పుడు పరాకు చెప్తూంది ఓ పక్షిరాజము.

పాంథులకు సహాయపడి పరమానందము వారికి ప్రసాదించి, పవిత్రత గాంచే నన్ను; నాసుందరనాట్యవిన్యాసములకు లోలులయ్యే నాపాంథబాంధవులు నన్ను చూచి దూరమౌతారు. నన్ను తేరిచూడ భయపడుతారు.

ఎంతటి పాపంచేశాను. అంటూ మన స్సేమిపోక కలవరపడే నదీసుందరి మూలుగు, మధ్యజీవితాంతమునకై మనశ్శోభపడే 'దభీ' శబ్దాలు వినిపిస్తునై.

కూడుగుడ్డ లేకపోయినా ఏదోదొరకవచ్చుననే ఆశతో అన్నీమరచేవాడ్నికి ఎంతబాధ కల్గిస్తూందిరా ఈరాత్రి! అనే అనాథజీవులు రోదనలు చేస్తున్నారు.

సర్వాంగములు శుభకళలతో శోభిల్లి సౌందర్యమూర్తినై అసమాన ఆశీస్సుల నందే నాకు వైధవ్యంలా ఏంటి ఈనల్ల చీర? నన్నుచూచి తొలగిపోయే వీరేనా నా ఆరాధకులు అని దుఃఖాన్న తొందరగబోయే పెద్దన్నల పలకరిస్తూంది ప్రకృతి.

పగలెక్కడా బత్యాలు కిట్టనందున తాపత్రయ పడుతున్నారు ఎర్రరోగులు.

నిన్ను ఊరికే పోనివ్వక అందరూ ముఖాల్నిచూపి ఆదరించేవారు. ఏరీ? నిన్ను నువ్వే ఆరాధన అంటూంది ఆత్మ.

నిలకడగావుండక దేనికో లోబడిపోయి రూపులో మార్పు చెందుతూంది నీడ.

తమకాంతి ప్రసరింపచేసి, వింతవస్తు

వుల్ని చూపుతూ, యువతీయువకుల హాసకేళీవిలాసములకు తావొసగిన తమ ప్రతిభ తగలడ్తూంది అని కాచికాచి కండ్లొత్తబారిన విద్యుద్దీపాలు.

అయ్యో! ఎంత జాలిగొలుపుతూంది ఈకాళరాత్రి!

* * *

నిముషానికో మార్పుచెందుతూ నిలబడినపాటున నీరుగట్టించే నీలాంబర ధారణం.

నల్లటి రూపుపొందుతేనేగానీ మా కాంతి బయల్పడదు అని సమయానికెదురుచూసే స్వార్థపరుల్లా చుక్కలు.



నేనసలు వింతజీవినని విర్రవీగిన వెర్రిప్రాణులు నన్నుచూచేగా అంటూంది ప్రకృతి.

పగలెందరు గోలపెట్టినా, రాత్రి నాకే అవకాశమొచ్చినందుకు ఆనందం! అంటూ అరుస్తూంది ఆపక్షి.

నన్నెందరు ఎన్నివిధాల వుపయోగించుకున్న మలినురాలనుగాను. మూర్ఖులై నన్నుతెలియక వర్తించేమూర్ఖుల్ని చూస్తూంది అని గొంతుతేస్తూపోతూ నదీసుందరి, ఆత్మబంధువులతో చెప్పుకుంటూంది కబుర్లు.

ఆనాధజీవులలా అన్నంలేక అవస్థపడుతూంటే మరణదృశ్యాలు చూపుతూ దోబూచులాడ్తూంది ప్రకృతి.

దూరాన్న మా సంచారంమాని భ్రమపడి, భయపడి తమజోలికిరాని మానవుల్నిచూచి విర్రవీగుతున్నారు పెద్దన్నలు.

క్షణం కోరూపు నాలోవుందిగాని నీలోలేదని నిశ్శబ్దంగా పోరాడుతూంది నానీడ.

మేముంటే భయంలేదనే మీకు ఇప్పుడనేకభావాలు పుట్టిస్తాం. అనేకరూపాలు పొందుతాం. కానీ మాజీవితం ఎప్పుడూ యింతే! అంటున్నాయి విద్యుద్దీపాలు. ఆహా! ఈకాళరాత్రి ఎంతవిచిత్రంగావుంది!

* * *

నిర్మల నీలిరంగు చీరపైన బంగారు పిందెల అంచులతో మధ్య మాణిక్యరాశితో నలరుచూ నిశ్శబ్ద సంగీతాల్ని పలికిస్తూంది రజనీదేవి దివ్యమోహనాకారము.

ఆనందమయసమయ మిదే అంటూ సపరివారంగా బయలుదేరే ఆమె రాకకు ధన్యతగాంచే భాగ్యమబ్బుతూంది అంటూ పాడుతున్నాయి పక్షులు వైతాళికుల్లాగ.

సుందరమైన నడలతో కాళ్లకు గజ్జెలుకట్టి, మృదంగ శబ్దాన్వయింపులతో ఎదురొచ్చి ఆహ్వానవిస్తూంది నదీకన్య.

సుమధుర సువాసన సంభరిత మంద మలయ మారుతవీచికలు నాసొంతధనమనే ప్రకృతి.

అన్యతలంపు మాకేలా? అని యోగీశ్వర ఆకృతిలో వున్నాయి వృక్షాలు.

ఆకలిబాధ, అవస్థలను సహింపచేసి హాయిగ పొత్తిళ్ళలోనుంచి జోలపాటల పాడుతూంటే నిద్రపోయే అభాగ్యజీవులు.

దూరాన్న మాకాంతి ప్రకాశింపచేయగలిగే అవకాశమొచ్చిందే అని పెద్దన్నలు ఆనందపడుతున్నారు.

మహానందంతో "మీకు ఆహ్వానసమయాల్లో, మందిరాలికి తోరణాలు మాకాంతులు అంటున్నాయి విద్యుద్దీపాలు. వింతరూపలైనా వికారరూపంగాక నా ఆత్మలో మైలని తుడిచేస్తూంది నానీడ.

తొందరెందుకు? ఆనందించు అని బలవంతపెట్టే ప్రియమిత్రుడిలా బోధించుతూంది ఆకాశవాణి.

నాఆత్మ ఆనందకందళితమై ఊగిపోయింది.

ఎంత ఆనందకరమైనది ఈకాళరాత్రి !

—'భమిడిపాటి'

Printed at the Andhrabhumi Printing Works, 36 Mukatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.